శ్రీ సద్గురు పరమాత్మనే నమః

# స్వస్వరూపసంధానము

## శ్రీ గీతా నిష్కామ యోగము

(ప్రాచీన గ్రంథము)




శ్రీయుత మాకం తిమ్మయ్యశ్రేష్ఠి గారిచే

ర చి యిం ప ( బ డి,

శ్రీ బూరెల సత్యనారాయణమూర్తిగారిచే

పరిష్కరింపఁబడినది.





1958




వెల రు. 3-0-0

1945 సం॥ ప్రథమ ముద్రణము 3000 ప్రతులు మదరాసు.
1950 సం॥ ద్వితీయ ముద్రణము 3500 ప్రతులు సికింద్రాబాదు.
1958 సం॥ తృతీయముద్రణము 3000 ప్రతులు సికింద్రాబాదు.

卐

ప్ర కా శ కు :
పండిత మాకం తిమ్మయ్య శ్రేష్ఠి
శ్రీ మ ద్గీ తా ల య
89/A. బారింపటాలం
సికిందరాబాదు.

ఓమ్

శ్రీకృష్ణ పరమాత్మనే నమః



గ్రంథకర్త:

శ్రీ మాకం తిమ్మయ్యశాస్త్రి

ఓమ్ :

శ్రీకృష్ణ పరమాత్మనే నమః



పరిష్కర్త:

శ్రీ బూరెల సత్యనారాయణమూర్తి

(7555 కలాసిగుడ, సికింద్రాబాదు.)

# మూడు రత్నములు

(1) నిన్ను నీవు తెలిసికొనినప్పుడు, భగవంతుని తెలిసికొన గలవు. "నేను" అనునదిఏది : చేయియా, కాలా, మాంసమా, రక్తమా లేక శరీరములోని మరేదైన భాగమా ? బాగుగా యోచింపుము. "నేను" అనున దేదియు లేదని, నీకే తెలియగలదు. నీరుల్లిపాయపొరలను వలచినకొలది పొరలు వచ్చుచునేయుండును కాని, పలుకవగిన దేదియును కనబడదు. అట్లే అహంకారముయొక్క స్వరూపమేమి ? అని పరిశోధించిన అది తానుగా అదృశ్యమై పోవును. మిగులునది "ఆత్మయే" (చిత్స్వరూపమే) అహంకారము. అది నశించినప్పుడే, భగవంతుడు ప్రత్యక్షమగును.

(2) మరియును అపక్వాహంకారము (అశుద్ధము) పక్వాహంకారము (శుద్ధము) అని రెండు విధములు. ఇది నా యిల్లు, నాభార్య, నా పుత్రుడు, నాధనము, నేను, నాది, అను భావము గలది అశుద్ధము; అపక్వాహంకారము. నేను భగవంతుని సేవకుడను, నేను వాని పుత్రుడను, నేను నిత్యముక్తుడను, నేను జ్ఞాన స్వరూపుడను, అనునట్టిభావముగలది శుద్ధము; పక్వాహంకారము.

(3) పురుషుడు శరీరమునందున్నంత కాలము వాని అహంకారము వానిని పూర్తిగా విడువజాలదు. ఏమాత్రమో కొంత సదా శేషించియే యుండును. ఎట్లనగా? కొబ్బరిచెట్టు మట్టలు పడిపోయినను, అస్థలమున వానిగుర్తులు మిగులును. అహంకారముకూడ ఇట్టిదే, అయినను స్వల్పమైన యీ అహంకారము ఆత్మజ్ఞానియై యున్నవానిని బాధింపదు.

ఓమ్
శ్రీ కృష్ణపరమాత్మనే నమః.

# శరీరతత్త్వము

———:O:———

దైవాత్మస్వరూపులారా !

తొమ్మిది బెజ్జాలతోగూడిన యీ శరీరతత్త్వమెట్టిదో బాగుగా గమనించుడు.

సీ॥ తొమ్మిది బెజ్జాలతోలుతిత్తేగాని
కాంతి గుల్కెటి వజ్రఘటముగాదు;
కడుపులోపలను దుర్గంధతిత్తులె కాని
చందనాగరు సువాసనలు లేవు;
నిత్యనిత్యము చాల నీచులూరునుగాని
పునుగు కస్తూరీలు పుట్టబోవు;
యిట్టి నీచపుదేహ మెల్లకాలంబును
దాచుకోలే డెంత ధన్యుడైన;
యింతమాత్రినకే మూర్ఖు లంతపొడవు
నిక్కెదరు; నీల్గెదరు; మేమె యెక్కువనుచు;
చక్రధర ! ధర్మపురిధామ ! సార్వభౌమ !
నరహరీ ! భక్తజనకల్ప ! నాగతల్ప !

సీ॥ పురుషర క్తము ఘటంబులమీద శుభ్రమై
రతివేళ మూత్రరంధ్రములు దాటి;
అంగన గర్భంబునందు దేహము గూడి
మల మూత్ర దుర్గంధ మలములోన,
మెదలుచు శ్రమను తొమ్మిదినెలల్ వేగించి
బలుదుఃఖమున మూత్రబిలము నుండి,
వెళ్ళి వచ్చిననాడు నీ వెంత గర్వించె
నీచ జన్మంబె త్తి నిక్కు టేమి?
నాదు జనన మెక్కువనుచు వదరువాని
చూడ నవ్వను గలుగు యశోవిహార!
చక్రధర ధర్మపురిధామ! సార్వభౌమ!
నరహరీ! భ క్తజనకల్ప! నాగతల్ప!

సీ॥ భవిష్యత్ కడు హీన బహుళ మాకారంబు,
ఎంగిలిమంగలం బంగభూమి;
తేర నువ్వులపోతు దేహస్వరూపంబు,
రోగాలపుట్ట యీ రోతకొంప;
భయముకు పుట్టిల్లు, పాతకంబులు పొంది,
యమబారి గొత్తె యీ యలతియొడలు;
మల మూత్ర ర క్త దుర్మాంస మీచెడు కుసు
మాలిన బాములీ మలిన తనువు;

తోక పురుగులగుంట యీ తోలుతిత్తి;
అరయ ఆకాంక్షసౌఖ్యంబు లందగోరి
కోరి శుద్ధ పవిత్రప్రాయులైరి జనులు;
నరహరీ! భక్తజనకల్ప! నాగతల్ప!

ఇట్టి నీచపుదేహమును మహాశ్రేష్ఠమైన జన్మమని మహనీయులు, మహాత్ములచే కొనియాడబడుటకు కారణము యేమనగా?

ఈ నీచపు శరీరమునందు నివసించియుండు ఏ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమును మహాఋషులు, మహనీయులచే కొనియాడబడుచున్నదో, అట్టి పరబ్రహ్మమే నిత్యమై, శుద్ధమై, బుద్ధమై, ముక్తమై, సత్యమై, శాంత స్వరూపమై, ఆత్మస్వరూపమై వెలుగుచున్నది. అట్టి ఆత్మ స్వరూపతత్వ మిట్టిదని తెలిసికొని ప్రతినిత్యమును భక్తి శ్రద్ధలతో ప్రార్థించుచు పవిత్రము జేసికొన్నయెడల యీ శరీరమే మహాశ్రేష్ఠమైన మానవజన్మమని కొనియాడ బడుటకు కారణమని గ్రహింపవలెను.



# శ్రీ స్వస్వరూప సంధానము

| సంఖ్య. | విషయసూచిక | పుట. |
|---|---|---|
| 27. | సచ్చిదానంద పరబ్రహ్మస్తోత్రము ... | 86 |
| 28. | పరబ్రహ్మస్తోత్రము ... | 87 |
| 29. | నారాయణోప నిషత్తు ధ్యానము ... | 89 |
| 30. | మంత్రపుష్పము ... | 2 |
| 31. | శ్రీసద్గురు పాదకాష్టకమ్ ... | 99 |
| 32. | శివతాండవ స్తోత్రము ... | 101 |
| 33. | శ్రీరామపాదుకా స్తవము ... | 103 |
| 34. | అష్టోత్తర మననస్తోత్రము ... | 111 |
| 35. | శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము ... | 118 |
| 36. | శ్రీ సూర్యాష్టకమ్ ... ... | 125 |
| 37. | ఆత్మార్పణం ... ... | 126 |
| 38. | మంగళం భగవాన్ శంభో ! ... | 127 |
| 39. | శ్రీవిష్ణుహారతి ... ... | 128 |
| 40. | పరాత్పరా పరేశ పరంధామ మంగళం | 129 |
| 41. | నమస్కారము ... ... | 130 |
| 42. | భజన ... ... | 131 |
| 43. | శ్రీ శివస్తుతి నామావళి ... | 132 |
| 44. | ప్రార్థన జయ జానకీరమణ ... | 133 |
| 45. | శరణు శరణు సురేంద్రసన్నుత ... | 134 |
| 46. | నారాయణ తే నమోనమో భవ ... | 134 |
| 47. | దేవేశ గణారాధిత ... | 135 |
| 48. | కృష్ణగోవింద గోపాలగాతే చలో ... | 136 |
| 49. | మనువా గోవింద గోపాలగాతే చలో ... | 137 |
| 50. | శివస్తోత్రమ్ ... ... | 138 |
| 51. | శ్రీరామధ్యానము ... | 139 |
| 52. | హరేరామ హరేరామ రామరామహరేహరే | 139 |
| 53. | నేడు మనమందరముగూడి ... | 140 |
| 54. | పరమపితా మా ప్రార్థన వినరా ... | 141 |

| సంఖ్య. | విషయసూచిక | | పుట. |
|---|---|---|---|
| 55. | ప్రభుని మరటితివేతే | ... | 142 |
| 56. | నిఖిలజగములేలునీకు నిన్ను నేలకుండునా | | 142 |
| 57. | మరిరాదురా యీ మానుషజన్మము | | 143 |
| 58. | వదలకు మార్గము | ... | 143 |
| 59. | పూరణప్రేమలగాదిలమే | ... | 145 |
| 60. | జయగురుదేవదయానిధే | ... | 146 |
| 61. | హరినారాయణ గోవిందా యను | ... | 146 |
| 62. | ఘడి ఘడి ఘడి చరణతుజే | ... | 148 |
| 63. | అర్జునకేరణ భూమివిషేహరి | ... | 148 |
| 64. | ప్రభు తేరీమహిమా కిసవిద గావుం | ... | 149 |
| 65. | సునో అజ జగదీశ వినతి హమారీ | | 149 |
| 66. | ప్రభుతేరీ మహిమా కౌన బతావే | ... | 150 |
| 67. | మనవాకేం జగమేలి పటాయో | ... | 150 |
| 68. | జోజన ధ్యానధరే నిర్గుణకో | ... | 151 |
| 69. | ప్రభుఇక నామతేరీ సుఖకారీ | ... | 152 |
| 60. | జయ శివ శివ శివ శంకర | ... | 153 |
| 71. | సాధుసభా సద్గురుస్వామి సభా | ... | 154 |
| 72. | తాడేవిట పరని నికటకట పరకర | ... | 155 |
| 73. | ఆడుది మళయాళది | ... | 156 |

# శ్రీ గీతా నిష్కామయోగము

| | | | | |
|---|---|---|---|---|
| 1. | విన్నపము | ... | ... | 1 |
| 2. | శ్రీగీతాఆరతి | ... | ... | 6 |
| 3. | శ్రీ గీతామాహాత్మ్యము | | ... | 8 |
| 4. | అథఅంగన్యాస కరన్యాసః | | ... | 11 |
| 5. | అథహృదయాదిన్యాసః | | ... | 11 |

| సంఖ్య. | విషయసూచిక | పుట |
|---|---|---|
| 6. | గీతాధ్యానము ... ... | 11 |
| 7. | అర్జున విషాదయోగము ముఖ్యాభిప్రాయము | 13 |
| 8. | సాంఖ్యయోగము 2 వ అధ్యాయము | 21 |
| 9. | కర్మయోగము 3 వ ,, ... | 31 |
| 10. | జ్ఞానయోగము 4 వ ,, ... | 37 |
| 11. | కర్మసన్న్యాసయోగము 5 వ ,, ... | 43 |
| 12. | ఆత్మసంయమయోగము 6 వ ,, | 48 |
| 13. | విజ్ఞానయోగము 7 వ ,, ... | 55 |
| 14. | అక్షరపరబ్రహ్మయోగము 8 వ అధ్యాయము | 60 |
| 15. | రాజవిద్యా రాజగుహ్యయోగము 9 వ అధ్యాయము | 65 |
| 16. | విభూతియోగము 10 వ అధ్యాయము | 71 |
| 17. | విశ్వరూప సందర్శనయోగము 11 వ ,, | 78 |
| 18. | భక్తియోగము 12 వ అధ్యాయము ... | 90 |
| 19. | క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము 13 వ అధ్యాయము | 94 |
| 20. | గుణత్రయ విభాగయోగము 14 వ ,, | 101 |
| 21. | పురుషోత్తమప్రాప్తియోగము 15 వ ,, | 106 |
| 22. | దైవాసుర సంపద్విభాగయోగము 16 వ ,, | 111 |
| 23. | శ్రద్ధాత్రయ విభాగయోగము 17 వ ,, | 116 |
| 24. | మోక్షసన్న్యాసయోగము 18 వ ,, | 122 |
| 25. | శ్రీ గీతాతత్వరహస్యము | 134 |

18 అధ్యాయములు 701 శ్లోకములుగల
పారాయణ గ్రంథము సంపూర్ణము.
ఓం తత్ సత్.

---

ఓమ్.

శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# స్వస్వరూపసంధానము

## పీఠిక.

మహాశయులారా !

స్వస్వరూపసంధానము, ఇత్యాది మహావాక్యములు వేదాంతసారభూతముగా ఉపనిషత్తులలోనుంచి యెల్లరును పఠింప యోగ్యముగా నుండునట్లు కేవల అద్వైతానంద పరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మమే నేనని స్వస్వరూప జ్ఞానము గలుగుటకై అనేక మహాత్ములచే విదితంబుగా రచింపగలిగిన శ్లోకములను, సకల ముముక్షజనపారాయణోపయుక్తముగా అజ్ఞాన మను అంధకారమును నివర్తింపజేసి, జ్ఞానమును, ప్రకాశముకలుగజేసి పరబ్రహ్మస్వరూప సంధానము సిద్ధింపజేయునట్టిదియును, సకలపురుషార్థ సాధకముగను, శ్రవణ మనన నిధి ధ్యాసాత్మికమును నైన యీ స్వస్వరూప సంధాన మను చిన్నగ్రంథమును సంపూర్ణజ్ఞాన సిద్ధికొరకై రచియింపగలిగితిని.

దివ్యాత్మ స్వరూపులారా!

ప్రియత్న పూర్వకముగా ప్రతినిత్యమును స్తోత్రపారాయణచేయగా, ప్రతివారి హృదయమునందును భక్తిని బలపఱచి చిత్తచాంచల్యమును నశింపజేసి,అహంకార మమకారముల కెడమివ్వక, వైరాగ్యమును నుదయింపజేసి బుద్ధీంద్రియ సర్వస్వమును కేంద్రీకృతముగ జేసి స్వాత్మజ్ఞానానందమును గలుగజేయును.

ఐహిక సామ్రాజ్యము వేరు, మోక్షసామ్రాజ్యము వేరు. ఈ రెండిటికిని స్థితిగతులయం దెంతో భేద మున్నది. ఎట్లనగా ఐహికసామ్రాజ్యము ననుభవించు సుఖముగాని, నేత్రములకు కనుపించు వస్తువైభవముగాని, అమిత సంతోషకరమగు విషయములుగాని, నిలకడలేనివి; మెఱపువలె మెఱసి అంతలో నదృశ్యమగుచున్నవి (నశించుచున్నవి) మోక్షసామ్రాజ్యమునం దట్టి చంచలత్వములేదు. అందు సమస్తము శాశ్వతముగా నుండునది. ఇట్టి మోక్ష సామ్రాజ్యములో ఎంత కష్టపడినను దుఃఖమెంతమాత్రము గన్పడదు. శరీరము కృశింపజేయదు. మనస్సున కెంతో నుల్లాసమును సంతోషమును గలిగించునట్టి చల్లని వాయువులు మెల్లమెల్లగావీచుచుండును పుష్పములు వికసించి కమ్మని సువాసన గలిగించునట్లు మనస్సు వికసించును. ఎచ్చట చూచినను సంతోషము గలిగించును. ఆనందము నిచ్చును.

ఇట్టి సంతోషానందము క్షణమాత్రముగాక సూర్య చంద్రు లుండునంతవరకును స్థిరముగా నుండునది.

ఇట్టి శాశ్వతానంద మోక్ష సామ్రాజ్యములో నివ సించువా రెవ్వరు? ఐహిక విషయవాసనలతో వృథాగా కాలము గడుపువారు కారు, నేనును కాదు. మరెవ్వరు? ప్రతినిత్యమును స్వప్నరూప సంధానమును పానముజేయుచు భక్తియను నావతో భవసాగరమును తరించిన మహాను భావులు – వీరే మానవశ్రేష్ఠులు. ఇట్టివారే భక్తశిఖామణులు. వీరే లోకోపకారులు. ఈ మోక్షసామ్రాజ్యము వీరిది. అట్టి మహనీయులు ఐహికసుఖ విషయాదులతో నధోముఖులై చెడిపోవుచున్న సంసారదుఃఖము లనుభవించుచున్న మాన వులకు సరియైన బాట యిది యని త్రోవచూపుచుందురు. అట్టి చిత్తశుద్ధిగల మహనీయులు, భక్తశిఖామణులు రచి యించిన ధ్యానశ్లోకములు యిదివరకెందరో చదివియున్నారు. ఎందరో చదువుచున్నారు. ఎందరో వినుచున్నారు. కదా? వినిపించినదానినే వినిపించుట యేల? అందరికి తెలిసిన దానినే తెలిపించుట ఏల? అనగా ఈ ధ్యానశ్లోకములు నూతనములు గాకున్నను వినుపించుమార్గము మాత్రము కేవలము నూతనమార్గమే. ఎచ్చట హెచ్చిగించవలెనో, ఎచ్చట పోషింపవలెనో; ఎచ్చట నొక్కి పలుకవలెనో మొదలగు విషయములను వినినదానినే మరలమరల వినుపించక, చెప్పినదానినే మరల మరల బోధించక యుండుటచేత

సత్యమయిన సంగతులను గ్రుక్కదిప్పకుండ వినిపించ కపోయిన విన్నవారికి చక్కగా రుచింపదు. రుచింపక పోవుటచేత మనస్సుకెక్కదు. మనస్సు కెక్కకుండిన విన్నందువలన నేమియు ప్రయోజనము లేదు. కనుక ఇవ న్నియు మరలమరల చక్కగా బోధించినట్లైన బోధపడును. బోధ పడినమీద రుచించును. రుచించిన మనస్సుకెక్కును. మనస్సు కెక్కినసమీప నందున్న మహత్వ మిట్టిదని తెలిసి మరి మరి చింతించునట్లు అధ్యాత్మ నిరతిశయులు, లోకోప కారులు, కరుణామయులు అవతార మూర్తులగు శ్రీ శంకర రామానుజాచార్యులు మొదలగు మహానుభావుల వాక్కుల నుండి బయలువెడలిన అమృత ధారలు కొన్నిటిని వరు సగా ఈ చిన్నగ్రంథముగా వ్రాసియున్నాడను.

సోదర సోదరీమణులారా !

ఇది విన్నవారు మరియొకసారి వినగోరెదరు. చదివినవారు మరియొక్కసారి చదువగోరెదరు. సులభశైలి, భావము మధురము. లక్ష్యమా ముక్తి. ఆచరణమా పవిత్రము కావున మహనీయులారా ! జన్మములలో మానవ జన్మము చాలా ఉత్తమమైనది. పవిత్రమైనది. ఇట్టిఉత్కృష్టమైన జన్మము వచ్చినందులకు ప్రతి మానవుడును తన

ేవిత రహస్యములను తెలిసికొని ప్రతినిత్యమును బ్రహ్మ
ముహూర్తమున 5, ఘంటలకు మేల్కాంచి నిత్యకృత్యము
ను దీర్చుకొని స్తోత్రధ్యానములను అనుష్ఠించుచు రాగా రాగా,
ిర్మలమైన జ్ఞానము ఆనందముగలుగును. అప్పుడు ధన్యుల
ముగుదుము. లోకమునకు ఉపకారముజేసినవారమగుదుము.
గవదనుగ్రహమునకు పాత్రులగుదుము. ఇహమునం
దును, పరమునందును నిత్యసుఖము ననుభవింతుము.

ఇట్లు
సర్వజన శుభాభిలాషి,
పండిత, మాకం తిమ్మయ్య శాస్త్రి.



ఓమ్

శ్రీ కృష్ణ పరమాత్మనే నమః

## శ్రీ ప్రేమ గీతా సంఘము.

# ప్రార్థనా మాహాత్మ్యము

———:o:———

అవ్యక్తమూర్తులైన సంఘోద్ధారకులారా!

దోష భూయిష్ఠమగు, సంసారమున సంతోష మున కవకాశ మెక్కడిది? గమనించితిరా! మనస్సు నిర్మల మగుటకు జ్ఞానోదయము గలుగుటకు ప్రయత్నింప నక్కరలేదా! జాగ్రత్త పడుడు. మనము పరిపూర్ణులమై ఇతర సోదర సోదరీమణులను పరిపూర్ణులను జేయుటకై. మన సంఘ మభివృద్ధిజేయుటకై శ్రద్ధతో ప్రయత్నింప వలదా? మనము నేర్చుకొను విషయములు అనేకములు కలవు ఆమరణ పర్యంతము స్తోత్ర ధ్యానములు శ్రద్ధతో సలుపుచుండవలయును.

మనస్సుయొక్క బహిఃప్రవృత్తి అరికట్టి ప్రజ్ఞాన ఘనమగు ఆత్మశక్తిని బొందుటకై మనస్సు నంతర్ముఖము జేయుటయే జ్ఞానము బొందుటకు ప్రథమ సోపానము. మనస్సు నిర్మలమగుటకు, నిదియే సులభమైన మార్గము.

ఎంతటి దుర్జనుడైనను, ఇక నతడు యోగ్యుడు కానేరడని చెప్పవలదు. ఎందుకనగా, అతని ప్రస్తుతప్రవర్త

నలు, ఆతని అభ్యాసఫలితమేకదా? నూతనమైన అభ్యాస ములచేత తన పూర్వాభ్యాసములను నాతడు నిగ్రహించు కొనవచ్చును అట్టి అభ్యాసఫలితముచే మనోనిశ్చల మేర్ప డును. కావున ప్రతివారును మంచి అభ్యాసము అలవాటు చేసికొనుటయే, మనోనిర్మలమునకు చక్కనిమార్గము.

గమనించుడు, మహాప్రమాదములైన దుఃఖములను దాటుటకు ప్రయత్నించుడు ప్రయత్నించుటే పురుషార్థము. ఈ ప్రమాదకరమైన మోహము మనల నావరించియున్నది. కీడేదియో, మేలెదియో, వివేకముచే, శాస్త్రప్రమాణముచే నిర్ణయించుకొనుడు. ఇక నెంతమాత్రము తామసించుట తగదు. మన దుఃఖముల నశింపజేసుకొనుటకు ఇదియే సులభమార్గము.

ఇప్పుడు కాలమాహాత్మ్యము ఎట్లున్నదో గమనించి తీరా! మనము పూజించు దేవతావిగ్రహములు మూటగట్టి, గంగలో పడవేసియున్నాము. వేదశాస్త్రములన్నియు మూట గట్టి మూలయింట పడవేసియున్నాము సనాతనధర్మముల నుద్ధరించు సంఘములన్నియు, మాయబడియుండుటయేనా మనధర్మము? సోదరబృందములారా! ఇప్పుడైనను జాగ్రత పడుడు. శాంతముచేతను, నిర్మలప్రేమచేతను, సర్వదుఃఖ ములు తప్పక నశించును.

వ్యర్థమైన కుతర్కవాదముల నిమిత్తమై ఎవరైనను మీదగ్గరకువచ్చినచో, మర్యాదగాను, మృదువచనములతోను, శాస్త్ర సంప్రదాయములైన, మీ సానుభూతిని ప్రకటించుడు. మీయందు ఇట్టి ప్రధాన గుణములు ప్రకటితమైనప్పుడే, మహాశక్తి సామర్థ్యములతో, మీరు ఘనకార్యములుకూడ సాధించగలరు. నీతి ప్రవర్తనలతో, ధీరులైయుండగలరు. కావున మనము ఎల్లప్పుడు ప్రేమపూర్వకముగా ప్రవర్తించవలయును, మతవాద ప్రతివాదములతో మనకు నిమిత్తము లేదు

వంచనచేగాని, మోసముచేగాని, ఎట్టి కార్యములు సాధింపజాలము. నిర్మలప్రేమతోను, స్తోత్రధ్యానాభ్యాసములతోను, అఖండమైన సత్వశక్తి సామర్థ్యములచే సమస్తకార్యములు సాధించగలము. కావున శ్రద్ధతోను, దృఢబుద్ధితోను, నిష్కపటముతోను అహంభావన లేనివారై ఎల్లరితోను స్నేహభావనగలిగి శ్రద్ధతో ప్రతినిత్యము ఉదయము 5 గంటలకు స్తోత్రధ్యానములచే సదా ఆనందముగా నుండుటకు ప్రయత్నింపవలెను. ఇదియేపవిత్రమైనమార్గము.

ప్రేమస్వరూపులారా ! జీవాత్మ నివాసమగు, మహాశ్రేష్ఠమైన నీ దేహమందిరము కర్మసాధనముకదా ? ఇట్టి శ్రేష్ఠమైన దేహమందిరమును నరకకూపముగా మార్చుకొనువాడును, అలక్ష్యముగా జూచువాడును, నిందకుపాత్రులగుదురు; దుఃఖము ననుభవించగలరు

ఆత్మసంయమము శ్రద్ధతోసాధించినవారికి, బాహ్య విషయములగు దుఃఖములు ఎట్టివైనను బాధింపజాలవు. అతడు దేనికిని దాసుడు కాజాలడు. అతనిమనస్సు స్వతంత్రమైయుండును. అట్టి మహనీయుడు లోకమునందు కీర్తి గాంచును.

మనమెంత శాంతచిత్తులమైయుందుమో అంత విశేషముగా, లోకులచే ప్రేమింపగలుగుదుము. అప్పుడు ఎట్టి ఘనకార్యములైనను, సాధించగలము. జాగ్రత్తపడుడు. "మనస్సు" మనలను దిగలాగును, అధోగతి పొందించి, దుఃఖముల పాల్సేయును. ఇట్టి మనస్సు విషయ విరక్తి పొందినచో, మనోశీల మేర్పడును. ఇట్టి మనస్సే మనలను రక్షించును; విముక్తులను జేయును. మనస్సు నిర్మలములేని కారణమే, దుఃఖము ననుభవించుటకు కారణము.

సోదరబృందములారా! శ్రద్ధతో గమనించుడు. ప్రతిదినము శ్రద్ధతో, ప్రార్థనాభ్యాసములు సలుపుచు, మనస్సును యథేచ్ఛగా పోనివ్వక, దృష్టిని అంతర్ముఖముజేసి, ప్రార్థనలు సలుపుటవలన కొంతకాలమునకు, క్రమముగా, ఆ మనస్సుయొక్క చపలత్వముమాని, శాంతి నొందును. ఇట్టి రజోగుణమునకు సంబంధించినమనస్సును, శాంతింపజేసికొని శ్రద్ధతోను, దృఢబుద్ధితోను, అభ్యసించినచో తప్పక జ్ఞానోదయము గలుగును.

అట్లు ప్రతినిత్యము విడువక అభ్యసించినవారికి, నానాటికి క్రమక్రమముగా, మనోచాంచల్యము క్షీణించి మనస్సు ప్రసన్నత గలుగును. కొంతకాలము, అభ్యాసకులకు మనోవృత్తులచే దుఃఖములు అపరిమితముగా నున్నట్లు తెలియుచుండును. కాని అనంతరము క్రమముగా క్షీణించి పోవుచుండును. తుదకు మనస్సు సంపూర్ణముగా వశమగును. కావున ప్రతిదినమును శ్రద్ధతో సోమరితనములేక స్తోత్రధ్యానములు సలుపుచుండవలయును.

పరులకు జ్ఞానోదయము గలిగించుటకై, ప్రయత్నము చేయుటలో ఎన్నికష్టములు సంభవించినను, ఎంతటి మానావమానములు గలిగినను, కొంచమైనను గమనించక ధైర్యసాహసములతో, తీవ్రప్రయత్నములతో సాధనాభ్యాసములు సలుపుచుండుటయే మన కర్తవ్యమని భావించుచు సర్వదా ఆనందముగా నుండవలయును.

సమస్తమానవులను సోదరభావముతోను అత్యంత ప్రేమతోను, ఈ ప్రపంచమునందు అధ్యాత్మికా దావాగ్నిని ప్రజ్వలింపజేయవలయును ఆప్పుడు మనము సచ్చిదానంద సామ్రాజ్యమున, సుప్రతిష్ఠులమై, వెలయగలము. శ్రీభావార్థగీతామృతము 6 వ అధ్యాయము 29,30 శ్లో॥ నందు చెప్పబడినప్రకారము, పిపీలికాదిబ్రహ్మపర్యంతము సమస్తభూతములయందును, అంతర్యామియై ఆత్మస్వరూపుడై

ప్రకాశించుచున్నాడని తెలిసికొని. భేదవర్జితుడై సమభావనతో జూచుచు (భావించుచు) అనగా సకలభూతములయందున్న ఆత్మకును నాకును ఇంచుకైనను భేదములేదని నిశ్చయజ్ఞానములో భావించుచు, సమస్తజీవులయందును అత్యంత ప్రేమానురాగము జూపుటయే మానవునిధర్మము.

ప్రేమస్వరూపులారా! మనసంఘోద్ధరణకై ఉజ్వల దీక్షాపరులుకండు! ధైర్యముతో ముందంజ వేయుడు! కార్యసాఫల్యమునకు కృషిచేయుడు! కార్యక్రమములను శ్రద్ధతో సాగింపుడు కీర్తి గౌరవాదులకుగాని, పేరుప్రతిష్ఠలకుగాని, ఆశింపకుడు నూఱుపోగులను పేని, పెంటిగా జేసినచో, దానితో మదించిన ఏనుగునుకూడ బంధింప వచ్చునని జ్ఞాపక ముంచుకొనుడు

సర్వేశ్వరుడు అందరిని అనుగ్రహించుగాక! పరమాత్మశక్తి అందరియందును ప్రకాశించుగాక! తప్పక ప్రకాశించుచున్నదనియే నా నమ్మకము. ఉత్సాహ తరంగములు బహిర్గతము లైనవి. ఇక తత్ప్రభావమును, నెవ్వరును నరికట్టజాలరు.

సోదర సోదరీమణులారా!

ధైర్యసాహసములు, దయ, విశ్వమానవప్రేమ, ఆత్మవిశ్వాసము, ఇవియే ముఖ్యముగా మనకు కావలసినవి. తప్పక వాటిని మనకు పరమేశ్వరు డనుగ్రహించుగాక.

---

ప్రక్క పేజీలోగల ఆహార నియమములు గమనింపుడు.

# సాత్త్విక ఆహారము

సంఘోద్ధారకులారా ! ఆహార విషయమునుకూడ గమనించుడు. మనము భుజించెడు ఆహారమువలన రజస్తమోగుణములు, యింద్రియములు బలిష్టము లగుటయే గాక, శరీరముకూడ బలిష్టమగును. కాని స్థూల శరీరము మాత్రము వృద్ధిజేసుకొనిన, సూక్ష్మశరీరముకూడా వృద్ధి యగునుగదా ? కాన మనమెట్టి ఆహారమును భుజించెదమో అట్టి గుణముగల మనస్సు ఏర్పడును. ఆహారమువలననే గదా ! వ్యాఘ్రమునకు గజమునకు గుణమునందు భేదము గలిగినది. శుద్ధమైన నూనెయుండినయెడల దీపము స్వచ్ఛమైన ప్రకాశము గలిగియుండును. అలాగుననే మనము భుజించు భోజనవస్తువులు, (అనగా సాత్త్వికపదార్థములను) కొంతకాలము భుజించుటవలన రాజస తామస గుణములకు సంబంధించిన విషయాదులు నశించిపోవును. ఇట్లు సాత్త్వికాహారము వలననే శుద్ధమైన భక్తియు, శుద్ధభక్తివలన శరీరతత్త్వమును మనసును మార్చుటకు వీలగునని ప్రతివారును గమనించవలయును భగవంతునియందు నిర్మల భక్తి గలుగుటకును, మనస్సు నిర్మలమగుటకును, సాత్త్వికాహారమే శ్రేష్ఠము. ఎవరు సాత్త్వికాహారమునే సేవించుచున్నారో, అట్టివారికి మనస్సు దేహము శుద్ధమగును. సర్వ సందేహములు తొలగి భగవత్సాక్షాత్కారము లభించును. రాజస తామసాహారములు భుజించనేరాదు. సాత్త్వి

కాహారముకూడ దేహధారణమున కెంతవలయునో అంతనే భుజించవలయును. అధికముగా భుజించుటవలన ఆయువు క్షీణించును. రోగమధికమౌను, యోగములభించదు. నిదుర, మఱపు, కామము హెచ్చును. దోషాదులు వృద్ధిజెందును. మలమూత్రములచే బాధ గలుగును.

సాత్త్వికాహారమువలన ఇంద్రియములను జయింపవచ్చును. యోగాభ్యాసముచే శ్వాసము గెలువ వచ్చును. బలము ఆయువు వృద్ధిజెందును. తేజశ్శక్తి జ్ఞానము గలుగును. ఎప్పుడును భగవత్కైంకర్యములే చేయుచుండవచ్చును మరియును, అప్పుడప్పుడు ఉపవసించుట చాలా శ్రేష్ఠకరము. ఉపవశించుటవలన దేహమునకును, ఆత్మకును అత్యంత లాభము గలదు. అందువలననే మహానీయులు ఏకాదశి, శివరాత్రి రామజయంతి, కృష్ణజయంతి, సంక్రాంతి మొదలుగాగల వ్రతదినములయందు ఉపవశించుట శ్రేష్ఠమని చెప్పియున్నారు రాజసతామసాహారములు తటాలున మార్చిన రోగములు గలుగుటకు అవకాశము గలుగును కాన క్రమక్రమముగా రాజసతామసాహారములు తగ్గించుచు సాత్త్వికాహారమునే 5,6 నెలలు సేవించినట్లైన సాధించవచ్చును

ఇట్లు కొంతకాలము సాధన జేయుటవలనను, ప్రతిదినము సోదరులతోగూడి కొంతకాలము స్తోత్రధ్యానముల సలుపుటచేతను భగవంతుడు మనయందు ప్రేమగలవాడై

శాశ్వతానందమును, ఉత్సాహమును, భోగభాగ్యములనొసగి నిత్యసుఖముల గలుగజేయుట కెంతమాత్రము సంశయము లేదు. ఇది సత్యము.

సోదరులారా ! ఈ విధముగా ప్రతినగరమునందును ప్రతి గ్రామమునందును సంఘములు స్థాపించి ప్రతినిత్యమును ఉదయము, సాయంకాలము స్తోత్రధ్యానములను జరిపించిన మనము ధన్యుల మగుదుము. లోకమునకు ఉపకారము చేయువారమగుదుము. (లోకమున ఎల్లరిని భగవంతుని కృపకు పాత్రులగునట్లు జేసినవార మగుదుము) ఈ కార్యము అసాధ్యమనిశంకింపపనిలేదు. సర్వభారములు భగవంతునిపైవేసి నలుగురైదుగురుమాత్రము శ్రద్ధతో ఒక స్థలము నిర్మించుకొని, ప్రేమసంఘము స్థాపించి సర్వులకు తెలియజేయుచు, ప్రతినిత్యము వేకువజామున స్తోత్రధ్యానములకు ఆరంభముచేసిన నిర్విఘ్నముగా కొనసాగగలదు. వేకువజామున స్తోత్ర ధ్యానములకు మహాశ్రేష్ఠము ఆ సమయమున మలయమారుతము భగవంతునివద్దనుండి, భక్తునివద్దకు, భక్తునివద్దనుండి భగవంతునివద్దకు మనోభావములను ఆనందమును గలుగజేయుచుండును. ఈమలయమారుతము మనస్సును లయముచేయుటకు చాలా సహాయముగ నుండును. దేహమునకు చాలా ఆరోగ్యము నిచ్చునది. రాత్రిఅంతయు మనస్సు విశ్రాంతి జెందియుండుటచేత మహాశక్తితో కూడుకొని యుండును ఈ కారణముచేతనే

నిద్రలేవగానే వేకువజామున భగవధ్ధ్యానమునకు చాలా శ్రేష్ఠ మని మహాత్ములు చెప్పుచున్నారు.

ఈ మనస్సు పగటివేళంతయు వ్యవహారములలో చిక్కియుండును. గనుక భగవధ్ధ్యానముచేయు ఇచ్ఛగల వారు దృఢ నిశ్చయముతోను పరిపూర్ణ విశ్వాసముతోను, నలుగురైదుగురు చాలును. క్రమేణ అనేకులు ఒకరొకరుగా వచ్చి చేరుదురు. అప్పుడు ఆనందమును, ఉత్సాహమును అధికమగును. ఈ సంఘమునకు చేరినవారేగాక ఇతర సోదరులనుకూడ మర్యాదగా పిలిచి కలుసుకొని ధ్యానించ వలయును. ఈ ధ్యానము పురుషులేగాక, స్త్రీలుకూడా ఈ సంఘమునందు ప్రతిరోజువచ్చి ధ్యానింపవచ్చును. సర్వదా జాగరూకులై అచ్చటకు వచ్చునట్టి తల్లులకు, పిల్లలకు ప్రేమతోను, మృదువచనములతోను, స్వామిని ప్రేమించు విషయములను బోధించవలయును. ఇట్లు చేసి చూపించు టయే శ్రేష్ఠమైనమార్గము. స్వామి ప్రీతికొరకనియే చేయ వలయును. ఇంతకంటే సులభమైన మార్గమింకొకటిలేదు. ముమ్మాటికి సత్యమని నమ్ముడు. మహనీయులారా! ఈ జన్మము వచ్చినందులకు ప్రేమసంఘమొకటి ఏర్పాటుజేసి సర్వజనులు సోదరభావముతో కలసి ప్రతినిత్యము భగవ ధ్యానము చేయుచు, భగవదనుగ్రహమునకు పాత్రులగుదు రని నామనఃపూర్వకముగా ప్రార్థన. ఇందులకు వలయు శ్రద్ధ, భక్తి, జ్ఞానము, విశ్వాసము, దయ, మనకు జగ దీశ్వరు డిచ్చుగాత.

ఓం తత్సత్.

# ఓంకార ధ్యానమహిమ.

——:o:——

మం॥ సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వ ।
మున్నామయతీ త్యోంకారః॥

అనగా, "ఆత్మను" మోక్షస్థానము, లేక సుషుమ్నా గ్రముము, లేక, సాక్షిత్వమును గలుగజేయునది కావున, ఓంకారశబ్ద మేర్పడినది. దీనికి ప్రణవశబ్ద మెట్లు వచ్చిన దనగా, ప్రకృతిలో చిక్కుకొనియుండు జీవులను నివృత్తి జేసి, ప్రకృతిరహితుని అనగా పరమపురుషుని పరమాత్మతో చేర్చుకారణముచే, ప్రణవమను శబ్దము వచ్చినది.

మహాశయులారా!" ఓంకారమే" సర్వవేదసారము. ఇట్టి ఓంకారముయొక్క పరమరహస్యమును, మహిమయు. మాధుర్యమును, ధ్యానించువారు పొందెడు శాశ్వతముక్తి యును, ధ్యానముచేయు పద్ధతియు, ధ్యానించువారి అధికా రమును, ముముక్షువులు గ్రహించవలసిన ముఖ్యవిషయ ముగా నున్నది కావుననే, బాలురకు మొట్టమొదట అక్షరా భ్యాసకాలములో, "ఓ-న-మా-లు" నేర్పించుట ముఖ్యరహ స్యమై యున్నది

మహానుభావులు కరుణామూర్తులగు మహర్షులు ఇట్టి ఓంకారరహస్యమును, సమస్తమానవులు ఉద్ధరించు

కొరకై, వేదములకు మూలమైన మహామంత్రమును, మొట్టమొదట తమశిష్యులకు ఉపదేశించిరి. వారిద్వారా సర్వ జనులకు ఉపదేశింపబూనిరి. దీనికి అక్షరాభ్యాసమనియు, విద్యాభ్యాసమనియు, దివ్యనామములుగా ఏర్పాటు జేసిరి. కావున మనము, అక్షరవిద్యయొక్క రహస్యమును గ్రహింపదగినది. ఎందుకనగా, ఈ రెండు పదములు వేరువేరుగా విభజించి చెప్పినపుడు, అక్షరాభ్యాసమనియు, విద్యాభ్యాసమనియు చెప్పవచ్చును. ఈ రెండు ఒకటిగా కలిపి చెప్పిన అక్షరవిద్యాభ్యాసమని చెప్పవచ్చును.

అక్షర విద్యాభ్యాస మనగా, అక్షరమైన విద్య (ప్రకృతి) అని చెప్పబడును. అక్షరమనగా, క్షరముకానిది. (క్షరఃసర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే) అని గీతయందు చెప్పబడినది. అనగా, చరాచర జగత్తంతయు, క్షరమనియు, కూటస్థు డొక్కడే ఆత్మయనియు, అక్షరుడనియు తెలియజేయుచున్నది. భూర్భువాది సత్యలోకము వరకున్ను, అతలవితలములుగా గల పాతాళలోకమున్ను, వానితోగల శరీరోపాధులున్ను క్షరములే. అనగా, నశ్వరములేగదా ! మరియును, త్రిమూర్తులు, వారియొక్క లోకములుఅనగా, బ్రహ్మలోకము, వైకుంఠము, కైలాసాదులు కూడ క్షరములయందు చేరినవి అని గ్రహించవలయును.

మహాశయులారా !

ఇప్పుడు మనము అభ్యసించునది, "క్ష ర ము" అనగా, అవిద్య; నశించునది. అక్షరమనగా, నాశరహిత మైనది. బ్రహ్మవిద్య ? అని ఒక్కొక్కరున్ను దీర్ఘముగ మనస్సునందు చింతనజేయుడు మనకు ఉపాధ్యాయులు ప్రథమమున అక్షరవిద్యాభ్యాసమనిచెప్పి క్షరాభ్యాసము చేయవచ్చునా ? రెండవది విద్యాభ్యాసమనగా, బ్రహ్మవిద్య యని చెప్పబడును. కావుననే గీతయందు "అధ్యాత్మ విద్యా విద్యానాం" అని శ్రీకృష్ణమూర్తి బోధించియున్నారు. అట్టి ఆత్మవిద్యమాత్రము విద్యయనిచెప్పబడును. తక్కిన వన్నియు అవిద్యయే యగును. దీనికి అవిద్య, మాయ, అజ్ఞానము, ప్రకృతి అని పర్యాయపదములు గలవు.

ఇట్టి పరమపవిత్రమైన అక్షరాభ్యాసము తెలియక అనేక శాస్త్రములు చదివినవారును, అనేకపండితులుకూడ, అవిద్యయను, మహాసముద్రమునందు మునిగి దిక్కు తెలియక, తాపత్రయాగ్నిచే తపించుచు దుఃఖములననుభవించుచున్నారు. మరల మరల కర్మము లను కాననమధ్యలో చిక్కుకొని ఘోరసంకటము లనుభవించుచున్నారు. కావున అక్షరాభ్యాసమని బోధించి క్షరమను అవిద్యనేర్పించు గురువుల చెంతచేరక, . యదార్థమైన అక్షర విద్యాభ్యాసమును, అనగా, బ్రహ్మవిద్యను నేర్పగల గురువులచెంతకు పోయి, వృద్ధులైనను, లేక వేదవేదాంగములను సాంగము చదివిన

వారైనను లేక స్త్రీలైనను, ఎవరైననుసరియే; అట్టివారివద్ద అభిమానము గర్వము విడిచిపెట్టి వినయ విధేయ నిర్మల గుణము గలవారై, అక్షరాభ్యాసమును నేర్చుకొని ఆత్మ నిష్ఠాపరులై తరించవలయునని, అనేక మహాత్ములు, అనేక శాస్త్రములయందు బోధించియున్నారు గమనించుడు

ఒక్కమారు ఓంకారమును ఉచ్చరించిన మాత్రముచే ఊర్ధ్వగతిని అనగా, ప్రకృతికిఅతీతమైన పరమపదమును, లేక ప్రపంచాతీతస్థితి గలుగజేయునట్టిది. కావున ఇట్టి స్థితిని పొందుగోరువారు, సద్గురువుల అనుసరించి దీనిభావమును బాగుగా గ్రహించి అనుష్ఠించవలయును. ఈ ఓంకారము నుచ్చరించునప్పుడు ప్రాణము ఊర్ధ్వముగా పోవునుగాని, అధోముఖముగా తిరుగదు. కావుననే గీత, 8 వ అధ్యాయ మునందు ఓంకారమును స్మరించుచు దేహమును విడుచు వారు బ్రహ్మము నొందగలరని శ్రీకృష్ణ పరమాత్మ ఉపదే శించియున్నారు. ఆత్మను పరమాత్మయందు చేర్చునట్టిది గాన ప్రణవమనబడును. ఇట్టి ప్రణవధ్యానమునందుమాత్రమే ప్రాణలయము (జీవబ్రహ్మైక్యము) గలుగును.

"ఓంకారము" పరబ్రహ్మ స్వరూపము. జననమరణ దుఃఖములకు కారణమగు సంసారసాగరమును దాటుటకు పడవవలె ఈ ఓంకారము, మాయామోహమను సంసార మునుండి తరింపజేయును. కావున ముముక్షువులకు ఉపాసనా యోగ్యమైనదని తారసారోపనిషత్తునందు చెప్పబడినది.

# ధ్యా న ము

ఇట్టి బ్రహ్మవిద్యా భ్యాసమువలన (విద్యాస్వరూప మైన బ్రహ్మమును) నెరిగి దృఢముగ అభ్యసించి అనేక మహాత్ములు తరించి యున్నారని మనము శాస్త్రములలో చదువుచున్నాము వినుచున్నాము. ఇట్టి ఆత్మవిద్యను అభ్య సించినవారు అవిద్యను దాటినవారైరి. కావున ఇది సామా న్య జనులకు సిద్ధించుట అసాధ్యము. ఎందుకనగా, అనేక జన్మసంస్కారముగలవారికిమాత్రమే సిద్ధించును తక్కిన వారు గురుకులవాసముజేరుకొని పూర్వము ఋషులయొక్క సాంప్రదాయకము ననుసరించి సాధన చతుష్టయములతో కూడి బ్రహ్మవిద్యను అవశ్యముగా అభ్యసించవలయును. అట్లు అభ్యసించువారికి చిత్తైకాగ్రత నొందును. అట్లు చిత్తము నిరోధము గలుగనివారికి పైచెప్పిన బ్రహ్మవిద్య అనగా ఓంకారాభ్యాసము అలవడుట మహాకష్టము.

మనస్సులో వృత్తులుండువరకు హృదయము బహి ర్ముఖముగా తిరిగియుండును. అట్టివారికి ధారణ ధ్యానా భ్యాసములు లేక మనస్సు బ్రహ్మనిష్ఠలో ప్రవేశము గలు గదు. వృత్తులు నశించినప్పుడు మనస్సు అంతర్ముఖముగా మరలుచుండును. అప్పుడు మాత్రమే స్వరూపాను సంధా నము సిద్ధించును. అద్దమును ప్రపంచమువైపున త్రిప్పిన దానియందు ప్రపంచము ప్రతిబింబము కనబడును. కాని,

వాని శరీరము కనబడదుకదా? తన ముఖము ప్రక్కకు అద్దము త్రిప్పిన లోకము కనబడను. తన శరీరముమాత్ర మే కనబడును. అలాగుననే, మనస్సు ఊర్ధ్వగామిగా నుండు నప్పుడు ఆత్మదర్శనము, అనగా సాక్షాత్కారము గలు గును. మనస్సు అధోముఖముగా యుండునప్పుడు ప్రపంచ విషయాదులమీద నుండునుగాని, ఆత్మ సాక్షాత్కారము పొందజాలరు.

కావున మహాశయులారా!

మానవజన్మము చాలా ఉత్తమమయినది, పవిత్ర వంతమైనది. ఇట్టి ఉత్తమమైన జన్మము వచ్చినందులకు ప్రతివారును తమజీవిత రహస్యమును తెలుసుకొని ప్రతి నిత్యమును బ్రహ్మముహూర్తమున 5 గంటలకు మేల్కాంచి నిత్యకృత్యములను దీర్చుకొని, నిశ్చల మనస్సుతో స్తోత్ర ధ్యానములను సలిపి 25 లేక 30 పైన చెప్పిన ప్రకారము శ్రద్ధతో ఉదయము, సాయంకాలము 2 వేళలలో ఓంకార ధ్యానము సలుపుచు రాగారాగా కొలదిదినములకు చిత్తశుద్ధి గలుగును. నిర్మలమైన జ్ఞానము గలుగును. మనస్సున కానందము గలుగును. అప్పుడు ధన్యుల మగుదుము. భగవదనుగ్రహమునకుపాత్రులమగుదుము లోకమున కుప కారము జేసినవారమగుదుము. ఇదిసత్యమని నమ్ముడు. ఇందుకు వలయు శ్రద్ధ, భక్తి, జ్ఞానము, భూతదయ మనకు పరమేశ్వరు డనుగ్రహించుగాక.

ఓమ్

శ్రీకృష పరమాత్మనే నమః

# శ్రీ గీతోపదేశము-నిశ్చయ భావము.

దయానిధి శ్రీకృష్ణ భగవానుడు తన యంశస్వరూప్పులగు సర్వమానవ శ్రేయస్సుకొరకై, అర్జునుని ప్రతినిధిగా జేసికొని శ్రీ భగవద్గీతా సందేశమును బాహ్యామునందు శరీర సుఖ మనుభవించుటకును, అంతరమందు ఆత్మసుఖ మనుభవించుటకును, రెండుభావములతో నుపదేశించియున్నాడు. మరియును లోకమునందుగల సమస్త మానవులకు అనగా సమస్త మతస్తులకు అన్ని పరిస్థితులలోను కర్తవ్యములు, వివేకముతో జీవించే పద్ధతులతో బాహ్యామునందు చెడుగుణములు, అంతరమునందు దుర్గుణములనుజయించి సుఖముగ జీవించుటకే గీతోపదేశముయొక్క నిశ్చయమైన భావము.

శ్రీ భగవద్గీత, హిందూ మతమునకే గాక, లోకమునందుగల సమస్త మతస్తులకు నిర్దేశింపబడిన మహా పవిత్రమైన ఉత్తమ గ్రంథము అని తెలియవలయును.

దైవాత్మ స్వరూపులారా! గీతా నిశ్చయభావము గమనింపుడు.

ఈ శరీర మను రాజ్యమే హస్తినాపురము. ఇది హస్తులతో నిర్మింపబడినది. కావున హస్తినా పురమని చెప్ప

బడును. ధృతరాష్ట్ర మహారాజనగా, గ్రుడ్డివాడు. (అజ్ఞానము) పాండు మహారాజనగా, శుద్ధ సాత్త్విక గుణమునకు సంబంధమైన, జ్ఞానము. వీరిద్దరు పరబ్రహ్మమను తండ్రి కుమారులు. సంజయుడనగా, సర్వేంద్రియములను జయించిన నిశ్చలబుద్ధి. అర్జును డనగా, వివేకముతో గూడిన జీవుడు. శ్రీకృష్ణుడనగా నిశ్చలమైన జ్ఞాన స్వరూపుడు. లేక పరబ్రహ్మ స్వరూపుడు.

ఈ నవద్వారములతో గూడిన దేహమను హస్తినాపురమందు ఒక ప్రక్కన ధర్మక్షేత్రము, ఒక ప్రక్కన కురుక్షేత్రమును, గలవు. ధర్మక్షేత్రమున కధికారి పాండు మహారాజు అనగా శుద్ధ సాత్త్విక గుణము; జ్ఞానము. వీరికి పుత్రులు (మనఃప్రాణాహి పంచపాండవః) అనునట్లు పంచప్రాణములే, ధర్మ భీమార్జున నకుల సహదేవులు. వీరివలన, శాంతము, దయ, కరుణ, ప్రేమ మొదలగు సద్గుణములచే, యజ్ఞములు, యాగములు, దానములు, ధర్మములు, పరోపకారములు, ఈశ్వర భక్తి, మొదలగు సత్కర్మములు నిష్కామబుద్ధితో జరుగుచుండుటవలన అట్టి హృదయ భూమియే ధర్మక్షేత్రము. ఇట్లు ఎవరు సద్గుణములతో, సత్కార్యములు జేయుచున్నారో, అట్టివారు పవిత్ర హృదయముగలవారు ఇహమందు. శరీర సుఖము, పరమందు ఆత్మ సుఖము, ననుభవింతురు.

ఈ దేహమే పాపకర్మములు జేయుటకు పుట్టినిల్లుగ నున్నది. ఎట్లనగా:— ఈ దేహమందొక ప్రక్కన కురుక్షేత్రమున్నది. ఈ కురుక్షేత్రమున కధికారి ధృతరాష్ట్ర మహారాజు, గ్రుడ్డివాడు; అజ్ఞాని. వీరికి ప్రకృతిజన్యములైన రజస్తమో గుణములకు సంబంధించిన అహంకార మమకారాదులు సమస్త విషయేంద్రియములు (101) పుత్రులు గలరు. వీరివలన మోక్షమునకు విరోధమైన చెడు కార్యములు అనగా కొట్టుట, తిట్టుట, ఒకరిని హింసించుట, జీవహింస జేయుట, పరులను దూషించుట, హింసపెట్టుట, పర ద్రవ్యమును అపహరించుట, స్త్రీలను భంగపరచుట, దొంగిలించుట, త్రాగుట, తినుట, 'నేను' అని అహంకరించుట మొదలగు చెడుకార్యములే నడుచుచుండును. కావున దుఃఖముల పాల్సేయు కురుక్షేత్రమని చెప్పబడును. కావుననే లోకమునందుగల మానవులకు చెడు గుణములవలన దుఃఖములు, మంచి గుణములవలన సుఖములు గలుగునని తెలియుటకై ఉపదేశించిన శ్రీ భగవద్గీత ఉత్తమ గ్రంథమని సర్వులు ప్రేమించుచున్నారు.

మరియును జీవుడనెడు అర్జునుడు సూక్ష్మ శరీరమనెడి రథమునం దారోహించి యున్నాడు. ఈ రథమునకు కట్టబడిన ఇంద్రియములే గుఱ్ఱములు, మనస్సే కళ్ళెము, అనగా లగాము. నిశ్చలబుద్ధి యనెడు జ్ఞాన స్వరూపుడు శ్రీకృష్ణభగవానుడు సారథిగా నున్నాడు. జ్ఞానస్వరూపుడైన

బుద్ధి, యింద్రియములనెడు గుఱ్ఱములను జాగ్రతతో శాస్త్రో క్తమార్గముగా ననుసరించి నడిపినయెడల జీవుడనెడు అర్జునుడు నిశ్చయముగా ఇహమందు సుఖము, పరమందు మోక్షము జెందవచ్చును.

అట్లు లేక నిశ్చల బుద్ధియను సారథి రజస్తమో గుణములు గలవాడై అజాగ్రత గలవాడై మనస్సు అను కళ్ళెమును వదలినచో, యింద్రియము లనెడు అశ్వములు, శరీర మను రథమును, రాజమార్గమైన వేదాంతమార్గమును వదలి అహంకార మమకారములకు సంబంధమైన విషయ వీధికి నీడ్చుకొనిపోవును. అప్పుడు రథికుడగు (జీవుడు) అర్జునుడు ఇంద్రియ విషయాదులకు సంబంధించిన అహంకార మమకారములకు లోబడినవాడై చెడు సంకల్పముల చేత, చెడుకార్యములు జేయును. అప్పుడు జీవుడు దుఃఖముల ననుభవించును.

కావుననే ఇంద్రియ నియామకుడైన పరమదయానిధి శ్రీకృష్ణ బగవానుడు సారధియై, తన అంశ స్వరూపుడగు జీవుడను అర్జునుని క్షేమము కొరకై, దుష్టబుద్ధిగల దుర్యోధనాదులను, నీయొక్క స్వధర్మమైన యుద్ధముతో జయించుము. అనగా అహంకారమునకు సంబంధించిన సమస్త విషయేంద్రియములను జయించుము. ఇహమందు

శరీర సుఖము, పరమందు మోక్ష మనుభవించుము. అని ఉపదేశించెను.

స్వధర్మ మనగా, యమనియమాది అష్టాంగయోగములచే, నిష్కామభావనతో చేయబడు ధ్యానమే సత్కర్మములు.

పరధర్మమనగా కీర్తి ప్రఖ్యాతులకై అహంకార మమకారాదులచే చేయబడు దుష్కర్మములు (కార్యకర్మములు)

ఇట్టి పాపకార్యములు చేయించునట్టి అహంకార మమకారాదులైన, దుర్యోధనాధులను, నీ స్వధర్మమైన సద్గుణములచే యుద్ధముజేసి దుర్గుణములను జయించుము. ఓంకార మను ధనుస్సు చేబట్టి, మనోశక్తి అను బాణము సంధించి, లక్ష్యార్థ మను త్రికూటస్థానమందు అంతరదృష్టి, గురిపెట్టి, ధ్యానమనెడు దెబ్బ కొట్టినట్లైన మనస్సు అను బాణము, లక్ష్యార్థమను జ్ఞాన స్వరూపుడు శ్రీకృష్ణ పరమాత్మయందు ఐక్యమగును.

అప్పుడు అహంకార మమకారాదులు యింద్రియ వర్గము లనెడు దుర్యోధనాదులు నిర్మూలమై, జీవుడను అర్జునుడు మోక్షసామ్రాజ్య మనుభవించును.

ఆత్మస్వరూపులారా !

సర్వ మానవ క్షేమముకొరకై శ్రీకృష్ణభగవానుడు ఇట్టి రహస్యములే, అర్జునునకు జేసిన గీతోపదేశము.

కావున మనమందరమును ఇట్టి రహస్యములను తెలిసికొని, ప్రతినిత్యమును శ్రద్ధతో ఆచరించుచు రాగారాగా, జ్ఞానో దయ మగును. అహంకార మమకారములు నశించును. పరమేశ్వరానుగ్రహమునకు పాత్రుల మగుదుము. లోకము సత్యయుగముగా మారును. అప్పుడు లోకసేవ జేయువార మగుదుము; ఇది సత్యం.

ఎవరు పరమ పావనమైన శ్రీ భావార్థ గీతామృత మును ప్రతినిత్యమును శ్రద్ధతో పారాయణ జేయుచున్నారో గీతారహస్యమును తెలిసికొని ఎవరు సత్కర్మములను అను ష్ఠించుచున్నారో అట్టివారు సమస్త పాపములనుండి విడ బడిన వారై ఉత్తమగతి (మోక్షము) నొందుదురని 18. అ. 71-72 శ్లోకములయందు శ్రీకృష్ణ భగవాను డుపదేశించి యున్నాడు.



ఓమ్

శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శ్రీ గీ తా ను ష్ఠా న ము

---:0:---

ఆత్మ స్వరూపులారా !

గీతానుష్ఠాన మనగా నేమి ? ఎట్లు ఆచరించవల యును అను విషయమును శ్రద్ధతో తెలిసికొన వలయును. శ్రీ భగవద్గీతయందు గల ముఖ్యాభిప్రాయములను సత్యముగా ఉన్నది ఉన్నట్లుగా తెలిసికొని అర్జునునివలె, మన మందరమును కృతార్థులము కావలయును. వాస్తవముగా శ్రీ భగవద్గీతయొక్క మాహాత్మ్యమును వాక్కుద్వారా వర్ణించుట కెంతమాత్రము సాధ్యపడదు. ఎందువల్ల ననగా, ఇది పరమ రహస్యమైన గ్రంథము. నాలుగు వేదములు, నూటఎనిమిది ఉపనిషత్తులు, అనేక శాస్త్రములయందు విస్తారముగా చెప్పబడియుండు సమస్తసారమును సంగ్రహముగా చెప్పబడియున్నది. అజ్ఞానులగు మానవులకు సులభముగా తెలియుటకై అత్యంత సుందరమైన సరళముగా నున్నది.

ఇట్టి పరమ పవిత్రమైన శ్రీ భగవద్గీత యందుగల తత్వరహస్యములను తెలిసికొని, శ్రద్ధా భక్తులతో ప్రతి నిత్యమును పారాయణ చేయుచు, (అనుష్ఠించుచు) వారికి,

ప్రతి పదమునందును క్రొత్త క్రొత్త భావము లేర్పడు చుండును. ఇది వాక్కునుండి వర్ణించుటకు సాధ్యపడదు. గీత 9 వ అధ్యాయమునందు చెప్పబడిన ప్రకారము బుద్ధికి అతీతమైనది. మనస్సు కతీతమైనది. కేవలము విద్యలలో రాజవిద్య హృదయగమ్యము. ప్రతి శబ్దమునందును సం పూర్ణ రహస్యము నిండియున్నదని స్పష్టముగా తెలియు చున్నది. కావున వాక్కునం దెట్లు వర్ణించగలము ?

ఇట్టి పావనమైన గీతను, వ్యాఖ్యాన టీకలతో దెలిసి కొనుట చేతగాని, ఒక శబ్దమునకు నూరర్థములు నూట యాభై తాత్పర్యములను విశేషార్థములను తెలిసికొనుటచేత గాని నేమి ప్రయోజనము ? నిజముగా, నిశ్చయభావమును దెలిసికొని అర్జునుడు ఆచరించిన విధముగా, శ్రద్ధయును. భక్తియును, తీవ్ర వైరాగ్యమును గలిగి యుండవలయును అట్లు లేక వ్యాఖ్యాన ప్రసంగములను ప్రబలము చేయుట వలన మనము గీతయందేది తెలిసికొని నిత్యసుఖము ననుభవించవలయునో దానిని ధారబోసికొని, నుభయభ్రష్ఠులము కావలసి వచ్చును. కావున భగవాను డుపదేశించిన గీతా రహస్యమును శ్రద్ధతో వినుడు.

# గీ తా ర హ స్య ము

ఓ భారతీయా ! ఓ జీవా !

మహా పవిత్రమైన గీతయందు చెప్పబడిన రహస్యముల దెలిసికొని నుద్ధరించిన మహాత్ముల దివ్య జీవితములను నీవు స్మరింపుము. "ఉత్తిష్ఠత" లెమ్ము "జాగ్రత" అజ్ఞాన నిద్రనుండి మేల్కొనుము. "ప్రాప్య వరాన్ నిబోధత" అనగా జాగ్రతనొంది, ఆత్మశక్తిని వికసింపజేసికొనుటకు ప్రయత్నింపుము. నిన్ను మోహబద్ధునిగ జేసి అజ్ఞానాంధకారమున పడద్రోయుచున్న అహంకార మమకారముల నన్నిటిని ప్రతిఘటించుము. ఇతర భావములన్నియు నిందులో కేంద్రీకరించుము. సంసారమున మెలంగినను, సంసారాతీతుడవై, (అసంగుడవై) సకల ధర్మములు నాచరింపుము. సదా నిష్కాముడవై, స్వార్థరహితుడవై వర్తింపుము.

జీవా ! నీవే ఈ గీతా స్వరూపుడవు. ఈగీత నీహృదయముననే యున్నది. మూఢుడవైతివా ! నీకు వినవచ్చుట లేదా ? "ఓమ్ యనెడు" శబ్ద స్వరూపుడగు సచ్చిదానంద పరబ్రహ్మమే, "సోహం, హం సోహం" నేనే బ్రహ్మం, బ్రహ్మం నేనే, అని శాశ్వత గానము జేయుచున్నాడు. అహోరాత్రులు నీ హృదయముననే జ్ఞానఝురి నెలకొని యున్నది. సదా కీర్తింపబడు చున్నది. ఇదియే గీతయందు

చెప్పబడిన సర్వశక్తి, ఆత్మతేజస్సు. ఇట్టి ఆత్మశక్తిచేతనే అనేకమంది మహనీయులు ఉద్ధరించి యున్నారు. దీనినే, ఆత్మ శక్తి యనియు, మనోశక్తి యనియు జీవశక్తి యనియు చెప్పబడును.

అట్టి ఆత్మశక్తి ప్రభావము తెలిసికొనజాలక, రాగ ద్వేషములకు లోబడినవారై, సమస్త విషయ వాసనలను ననుభవించుచు, భేదభావన గలవారై, సాంప్రదాయము లను, మతాచారములను బెట్టుకొని వానినిగూర్చి వాదులాడు కొనుచు ప్రాకులాడుచున్నారు. అట్లు లేక పవిత్రవారును. ఆత్మ తేజశక్తిని వృద్ధిజేసికొని, సంసిద్ధులరై యున్నచో, ఈ గీతయందు చెప్పబడిన సమస్త సద్భావములను, ఆత్మ స్వరూపుడైన శ్రీకృష్ణ భగవానుడే బుద్ధిద్వారా తెలియజేయ గలడు. అప్పుడు మనము ఈ గీతకు వారసులమని నిస్సం దేహముగ తెలియగలదు.

ఓ జీవా! నీవు ఎంతకాలము అజ్ఞాన మను నిద్రా ముద్రితుడవై యుందువు? ఆహా! నీకు ఎల్లప్పుడును అజ్ఞానమను నిద్రయేనా! అయ్యో! అజ్ఞానాంధకారమగు జీవితమే నీకు నిత్యానందకరముగనున్నదా? లెమ్ము అజ్ఞా నాంధకారమగు నిద్రనుండి మేలుకొనుము. జ్ఞానచక్షు వను కన్ను దెరచి, నానాభావ సమన్వితమైన ఈ విశాల ప్రపంచ మును జూడుము. ఎల్లకాలము శాశ్వతముగా ప్రకాశించు చున్న మహా పదార్థమును గుర్తించుము. ఓ పిచ్చివాడా!

నీ అమాయకత్వమునకు దుఃఖింపవలయునో, లేక సంతోష పడ వలయునో తెలియకున్నది.

జీవా ! నీ శరీరమును యింటనున్న అమృత భాండ మును దెరచి, నీకు విరోధులగు దుష్టులు కామక్రోధ లోభ మోహాము లనెడు దుర్యోధనాధులు ఘడీయ ఘడీయకు పరుగు పరుగున వచ్చి దోసిళ్ళతో కంఠమువరకు త్రాగి ఆనందించుచుండగా నీవు జూచుచు నూరకుందు వేల ? ఈ అమృతమును త్రాగుటకు నీవు హక్కుదారుడవు కావ నియా ? నీవు యజమానుడవు. జన్మాధికారివి కాదనియా ? లేక పరోపకారమనియా ? లేక అనిష్ట మనియా ? లేక అనుభవించుటకు యోగ్యత లేదనియా చెప్పుము.

అదిగో, ఇంకను అజ్ఞానమను పాడు నిద్రలోనే యున్నావా? లెమ్ము, జాగ్రతపడుము. జీవా! బుద్ధిని స్థిరము జేయుము. నీ శరీరమును, ఇంటిలోని మహాధనమును(మహా పదార్థమును) నీకు విరోధిగానుండు దుష్టులు అపహరిం తురు. కావున నీవు జాగ్రితపడి ఆ పదార్థమును నీవనుభ వించుము. నీయింట దొడ్డియందుండుఫలము, మధురమైనది కాదని, సారములేని పొరుగింటి వస్తువగు పండున కాశ పడకుము. ఆశపడితివా, నుభయ భ్రిష్టుడ వగుదువు. ఎను బదినాలుగు లక్షల జీవులలో మహోత్కృష్టమైనది నీ మానవ జన్మము. ఈ మాటను మరువక నీ జన్మమును, సార్థక

మును జేసికొనుము. ఇదియే విద్యుక్త ధర్మమని గ్రహిం చుము.

ఇట్టి ధర్మాచరణమునకు నీ వెంత తొందరగా ప్రయ త్నించిన నంత మంచిది. అట్లు లేక ఆలస్యము జేయుటకు నీవు చిరంజీవిగా నుండువాడవా? స్వల్పకాలము. కావున, ఆలస్యముజేయకుము. ఈ జీవితము ఎప్పుడో, ఏవేళనో, ఏచెట్టునో, ఏగుట్టనో, ఉదకమునో, ఊరునో, ఏ అడవిలోనో తెలియదు. "ఆలస్య మమృతం విషమ్"అనునట్లు గమనిం పుము. నీ సంపూర్ణజీవితకాలము నూరేండ్లుగదా? గుర్తిం చుము.

అందులో నిద్రావస్థలో కొంతకాలము, బాల్యావ స్థలో కొంతకాలము, యౌవనావస్థలో కొంతకాలము వృద్ధావస్థలో కొంతకాలము గడచుచున్నది. ఇట్లు వృథాగా కాలము గడచుచుండగా నీజన్మ సుకృత ఫలమును గూర్చి విచారింపక, ప్రయత్నింపక, అజ్ఞానమను నిద్రావస్థయందే మునిగి యుంటివేని, నీవెందుకును పనికిరానివాడ వగుదువు. వెఱ్ఱివాడా! శ్రేష్ఠమైన మానవుడని కీర్తి గాంచుట మహా దుర్లభము. దీపమున్నప్పుడే, యిల్లు చక్కబెట్టుకొన వల యును గాని, దీపమారిన యెడల అంతటను అంధకారమే యగును. అప్పుడు నీవెంత కష్టపడినను, కార్యసాఫల్యము జెందజాలవు. కావున ఈ స్వల్పకాలము వృథాజెయ్యక నీ జన్మ సాఫల్యమునకు ప్రయత్నింపుము.

గురువర్యా! తాము చెప్పినదంతయు, వాస్తవమే. జన్మ సాఫల్యమునకై ప్రయత్నించుట, నాకు ముఖ్యధర్మమే. కాని ఈ స్వల్పకాలములో, ఇట్టి మహాకార్యమును నేనెట్లు సాధింపగలను? స్వామీ! నాకు సులభమార్గ మెద్దియులేదా?

ఓ జీవా! నీకేల ఈ యధైర్యము. నీ శక్తికి మించిన కార్యమును జేయుమందునా! అట్లు నీవు జేయగలవా? నా మాట వినుము. నీజన్మము తరించుటకై నీవు భార్యాపుత్రాదులను విడిచి, సన్యాసిగా పోవలదు. నీ వనుభవించుచున్న భోగభాగ్య సుఖానుభవములను మానవలదు. అడవులకు బోయి కందమూల ఫలాదులను భక్షించి కాలము గడపవలదు. నిరశన వ్రతాదీక్షాపరుండవు కావలదు. గొప్ప గొప్ప యజ్ఞములు యాగములు సలుపమని చెప్పుటలేదు. ఉగ్రతపము లొనరించమని బోధించలేదు. నీవు సంసారపరుండవు. నీవు సంసారమునం దుండియే తరించుటకు సులభమైన మార్గ మొకటి గలదు. చెప్పుచున్నాను వినుము.

సంసార దుఃఖములు సమూలముగా నశించి శాశ్వత సుఖ మనుభవించుటకై ఆనాడు కురుక్షేత్ర మహా భారత సంగ్రామ రంగమున దయానిధి శ్రీకృష్ణ భగవానుడు జీవస్వరూపుడైన అర్జునునకు బోధించిన మహోత్కృష్టమైన గీతా శాస్త్రమును, అధిక శ్రద్ధాభక్తితోను శాంత మనస్సుతోను, సద్గురు విశ్వాసముతోను పఠింపుము. భవమునందు ప్రతివారును తరించుటకు శ్రీ భగవద్గీతయే శ్రేష్ఠమైనది.

ఎట్లనగా, వేదములు, ఉపనిషత్తులు, పురాణములు ఇంకను అనేక శాస్త్రములయందు గల, ముఖ్యమైన సారామృత మును గ్రహించి, శ్రీకృష్ణ భగవానుడే స్వయముగా నుపదే శించుటవలన శ్రీ భావార్థగీతామృతమని పేరొందినది.

కావున శ్రీ భగవద్గీత అన్ని శాస్త్రములకంటెను, మహోత్కృష్టమైన గీతాశాస్త్రమందు చెప్పబడిన విషయ భావములను (నిశ్చయ భావమును) గ్రహించి శ్రద్ధతో అనుష్ఠించుచు అనేక మహాత్ములు తరించియున్నారు. కావున నీవు ఈ మహాసంసార సముద్రమునం దుండినను పరమ పావనమైన శ్రీ గీతాశాస్త్రము యొక్క నిశ్చయభావమును గ్రహించి ప్రతినిత్యమును అనుష్ఠింపుము. శ్రద్ధతో గీతా పారాయణ చేయుము. అనగా,

గీతయందు చెప్పబడిన పదునెనిమిది అధ్యాయముల యొక్క సారమును గ్రహించి (సమస్త గుణములను) జయించుటకు శక్తిలేకున్నను, తుదకు అర్థశ్లోక మనగా, ఒకపాదము. అనగా ఒక గుణమునైనను గ్రహించి శ్రద్ధతో ప్రతిదినము ఆచరించినచో జీవుడు పావనుడగును. శుద్ధ సాత్త్వీక గుణముతో దైవత్వము పొందును అని భావము గాని శ్లోకములను మాత్రము పఠించి ఎత్తిపెట్టుట గాదు.

చదువురాదను కొందువేమో, ఇతరులు చదువుచున్న ప్పుడు శ్రద్ధతో వినుము. గీతాశాస్త్ర పరిభావము విచారణ చేసికొని తెలిసికొమ్ము. అట్లు తెలిసికొందువేని, తప్పక నీ సంశయము లన్నియు నశించును. మరల ప్రపశ్నిం

జాలవు. భగవంతుడు జ్ఞాన స్వరూపుడై ఎల్లప్పుడును ఈ శరీరమను గేహము నాశ్రయించి యుండును. ఈ గీతయను గృహమే యా మహానుభావునికి శ్రేష్ఠమైన గృహము. గీతలో చెప్పియుండు ఉత్కృష్ఠమైన జ్ఞానమును అవలంబించియే మూడు లోకములను పాలించుచున్నాడు.

ఈ గీతా శాస్త్రము వేదత్రియము. పరమానందము నిచ్చునట్టి ఉత్తమమైన బ్రహ్మవిద్య. ఇట్టి పరమపావనమైన గీతయున్నచోట సనకాదియోగులు, నారదాది మహర్షులు, ఇంద్రాది దేవతలు, కాశి ప్రయాగాది పుణ్యక్షేత్రములు, గంగాయమునా గౌతమీ మొదలగు పుణ్య తీర్థములు యింతయేల సకల చరాచర బ్రహ్మాండ మంతయును, ఈ శరీరమను గీతయందు అణగి యున్నది.

ఓ జీవా ! ఇట్టి మహోత్కృష్ఠమైన గ్రంథమును పఠించుటకు తీరికలేదని, శక్తి లేదని, చదువురాదని పనికి మాలిన మాటలు చెప్పకుము. అయ్యో ! నీ జీవితమంతయు జానెడు పొట్టకొరకు, మూరెడు గుడ్డకొరకు, క్షణకాల భోగములకొరకై, ఉపయోగించుటయా ! నీ యుద్యోగము? ఆహా ! ఇది కదా స్వాభిలాష ? స్వార్థము. ఇట్టి అల్పసుఖ సంపాదన కొరకై ఎన్ని అసత్యము లాడజేయవలయును ! ఎందరి హృదయములు నొప్పించవలయును ! ఎన్ని పాప కార్యములు చేయవలయును! ఇట్టి తుచ్ఛ విషయముల కాశపడి నీజీవితమంతయు వృథాగా గడుపుచు దుఃఖములు జెందుట కొరకా నీ జన్మము వచ్చినది ?

జీవా! నీజీవితము. నాటకరంగమున జరిగిందువు సమానము. నీకు తెలియకుండగనే రాలిపోవును. నీ జీవయాత్రా పరిధానమును బాగుగా గ్రహించితివా? క్షణకాలము బాలుడవు. క్షణకాలము యువకుడవు. క్షణకాలము రసికుడవు. క్షణకాలము అధిక వైభవోపేతుడవు. క్షణకాలము కూడు గుడ్డలకు లేక పరమ దరిద్రుడవు. ఇట్టి మార్పులకు లోబడిన వాడే పడకు జనన మరణంబులు పాటుపడకు అనేక శరీరములు ధరించి అనేక ఆట పాటలతో, అభినయించి వేసట గలిగి తెర మరుగునకు బోవు వేషగానివలె, నీవును యమపురి యనెడు తెర మరుగునకు పోవలసిన వాడవే. తెర వ్రాలినదా? నాటకము ముగిసినదే!

జీవా! కడచిన కాలము మరల దొరకుట దుర్లభము. కానరాబోవు కాలమును వృథా చేయకుము. ఈలోపలనే పారమార్థిక జ్ఞానమును సంపాదించుకొని అనాయాసముగా నీ జన్మస్థానమునకు జేరుటకు ప్రయత్న పడుము. జాగ్రతపడుము. ఆలస్యము జేయకుము, నీకు శుభము గలుగుగాక. ఇదియే దయానిధి శ్రీకృష్ణభగవానుడు అజ్ఞానాంధకారమున మునిగి దుఃఖముల ననుభవించుచున్న మానవకోటి కిచ్చిన గీతామృతము, ఇదియే గీతయొక్క నిశ్చయభావము. ఇందుకు వలయు, శ్రద్ధ, భక్తి, భూత దయ, వైరాగ్యము, పెద్దలయందు విశ్వాసము మనకు దయానిధి పరమాత్మ దయచేయుంగాక.

ఓమ్

శ్రీ సద్గురు పరమాత్మనే నమః.

దినచర్య

# ఆత్మశక్తిని వికసింప జేసికొనుట.

ప్రతిమానవుడు నిత్యసుఖముల ననుభవించు మార్గము.

దైవాత్మ స్వరూపులారా !

ఘోరమైన సంసార తాపత్రయములచే దుఃఖముల ననుభవించుచున్న జీవులను శాంతింపజేసి నిత్యసుఖముల ననుభవింపజేయుటకు మహాత్ములు కారణపురుషులై యున్నారు. అనాది కాలమునుండి ఇంతవరకు నెందరో మహనీయులు సంసారమునం దుండియే భగవద్ధ్యానముచే నిత్యసుఖ మను మోక్షము ననుభవించినట్లు వారియొక్క సచ్చరిత్రములను చదువుచునే యున్నాము; వినుచునే యున్నాము.

అట్టి మహాత్ములగు సత్పురుషులను స్మరించుచు, వారి గుణములను వర్ణించుచు, అట్టివారు లోక హితార్థము కొరకై నిర్మల హృదయముతో వర్ణించిన స్తోత్ర పఠనములను ప్రతినిత్యమును ధ్యానించుచు రాగా రాగా అంతఃకరణమునందు గల మాలిన్యము తొలగి మనోనిర్మల మగును,

అప్పుడు తప్పక ఆత్మశక్తి వికసించును. భగవదనుగ్రహమునకు పాత్రు లగుదుము. నిత్య సుఖముల ననుభవించగలము.

సాధారణముగా ఎచ్చటనైనా పదిమందికూడి స్తోత్రధ్యానములను చేయునప్పుడు భగవత్స్వరూపముల నెదుట నుంచుకొని స్తోత్రధ్యానములను చేయుట వాడుక కలదు. అట్టి రూపములు, ప్రకృతిపదార్థములతో తయారుచేయబడినవి. కాని భగవంతుడు కాదు. వాస్తవమే. కాని నిరాకార నిర్గుణ పరబ్రహ్మ స్వరూపుడైన భగవంతుడు అట్టి సగుణ రూపములతో, తన్ను నమ్మిన భక్తులను రక్షించుటకై ఈ రూపములను ధరించినాడని దృఢమైన విశ్వాసముతో స్తోత్రధ్యానములను సలుపవలయును. ఏకలవ్యునికి విద్య నొసగునది మట్టిబొమ్మగాదు. మార్కండేయుని రక్షించినది రాతిలింగము కాదు. సర్వత్రా వ్యాపించియుండు ప్రేమ స్వరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడైన భగవంతుడు రక్షించినాడు కదా ? భగవంతుడు భావనారూపుడు, ప్రేమస్వరూపుడు. (యద్భావం, తద్భవతి) అన్నట్లు అట్టి దృఢ భావనయే భక్తిని గలుగజేయును.

శాంత స్వరూపులారా !

మన దృఢమైన భావమును బట్టియు, పరిపూర్ణమైన ప్రేమను బట్టియు భగవంతుడు భక్తునికోర్కెలను నెరవే

ర్చును. ఇట్లు భగవదనుగ్రహము గలుగుటకు మార్గము శ్రీ రామకృష్ణాద్యవతారరూపములనుగాని, శ్రీ శంకరమహా విష్ణు రూపములను గాని, మనోరంజకముగా చిత్రింపబడి యుండు రూపముల నుంచుకొని, ఆ స్వరూపములను దర్శించుచు, సమస్త కల్యాణ గుణములను జింతించుచు కనులుమూసి అంతర దృష్టితో ఆ రూపములను తన హృదయ కమలమునందు దర్శించుచు దృఢమైన ప్రేమ విశ్వాసములతో స్తోత్రధ్యానముల జేసిన ఆ రూపములు మనకు చాలా సహాయకర మగును.

ధ్యానముచేయు కాలములో మాట్లాడరాదు. ఇటు అటు దిక్కులు చూడరాదు. ఒకరితో నొకరు జూచుటయు నవ్వుటయు కూడదు. అట్లు చేయుటవలన మనస్సు విషయాదుల యందు ప్రవేశించి భక్తి విశ్వాసములను చలింప జేయును. ఎట్లనగా,

ధ్యానించు సమయమున కండ్లు తెరచి యుండినచో ప్రకృతి సంబంధములైన వస్తువులపై దృష్టిపోవును. ఎచ్చటకు దృష్టి పోవునో అచ్చటకు మనస్సును పరుగిడును. అప్పుడు మనస్సుయొక్క ఏకాగ్రతకు ఆటంకము కలుగును. కావున మొదట అత్యంత ప్రేమతో భగవంతుని స్వరూపమును తన హృదయ కమలమునందు ప్రతిష్ఠింప జేసికొని స్తోత్ర పఠనములచే ధ్యానించవలయును. అట్లు ధ్యానించుటవలన మనస్సు నిర్మలమగును. హృదయము

కోమలమై కరిగి ఆనందము గలుగును. ప్రేమ జనించును. ఆనందబాష్పములు పొర్లి వచ్చుచుండును. గద్గదస్వరము గలుగును. దేహమున పులకాంకురము మొదలయిన చిహ్నములు గలుగును. ఇట్లు గలుగుటయే నిజమైనభక్తి.

ఇట్లు నిర్మలమనస్సుతోను, అత్యంత ప్రేమతోను, ప్రతినిత్యమును ప్రాతఃకాలము 5 గంటలకును, సాయంకాలము 6 గంటలకును రెండువేళలయందును భగవంతుని ధ్యానము చేయుటవలన మనకు ప్రేమ హెచ్చును. భగవంతునికి మనకు ప్రేమసంబంధ మేర్పడును. తప్పక దుఃఖములు నశించును. భయము తొలగిపోవును. ఇట్లు ప్రేమతో పరితపించెడు ఏ భక్తుని భగవంతు డుపేక్షించి యున్నాడు? భక్తునియొక్క ఆనంద బాష్పములు అమూల్యమయినవి. అట్టి ఆనంద బాష్పములు హృదయమునందలి విషయమాలిన్యము నంతయును కడిగివైచి పవిత్రవంతముగ జేయును. ముఖమునకు దివ్యతేజస్సు నిచ్చును. హృదయమును భగవంతునికి వాసయోగ్యముగా జేయును. ఆనందముచేగాని, పరితాపముచేగాని ఒక మారు కన్నీరు కార్చినవారికే, దానియందలి మాధుర్యము తెలియును.

ప్రేమ స్వరూపులారా!

స్తోత్రధ్యానములు చేయుకాలమున నిట్టి యానంద బాష్పములు వచ్చునంతవరకు శ్రద్ధతోను, అత్యంతప్రేమ

తోను, స్తోత్రధ్యానములను సలుపుటయే శ్రేష్టము. ఇట్లు ప్రతినిత్యమును స్తోత్రధ్యానములు చేయుటవలన భగవదను గ్రహము గలుగునా? ప్రేమ జనించునా? సమస్త దుఃఖములు నశించునా? అని సంశయింపనక్కరలేదు. ఎట్లనగా

మనకు స్వచ్ఛమైన ప్రకాశము కావలసినచో ఒక లాంతరును వెలిగించుకొనవలయును. అట్టి లాంతరునకు అమర్చబడియుండు గ్లాసును ప్రతిరోజును శుద్ధపరచుట చేత శుద్ధమైన ప్రకాశము నిచ్చును. గ్లాసును కొద్దిరోజులు శుద్ధిపరచకపోయినచో మలినమైన పొగచే ఆవరించినదై అందుండు దీపము యేలాగున ప్రకాశింపదో, ఆలాగుననే మన హృదయమును ప్రతిరోజును స్తోత్ర ధ్యానములచే శుద్ధిపరచకున్నచో మనలో ప్రకాశించుచుండు జ్ఞానదీపమును మలినములయిన విషయవాసన లను పొగచే ఆవరణమై అజ్ఞానుల మగుదుము.

మరియును, గృహములయందు మనము వాడుచుండు చెంబులు మొదలగు పాత్రలను ప్రతిరోజును ప్రాతఃకాలమున శుద్ధి పరచుచుండినచో మలినము పోయి తేజోమయముగా ప్రకాశించుచుండును. అట్లు ప్రతిరోజును శుద్ధి పరచనియెడల పాత్రలు చిలుముపట్టి ఏలాగున చెడిపోవునో ఆలాగుననే మనము ప్రతిరోజును ఉషఃకాలము అనగా ప్రాతః కాలమున 4½ లేక 5 గంటలకు, సాయం

కాలము 6 లేక 7 గంటలకు భగవంతుని స్తోత్ర ధ్యానములు సలుపనిచో, మన హృదయమునందు మలినము లయిన విషయ వాసనలచే మనస్సను పాత్ర అజ్ఞాన మను మలినముచే ఆవరించబడినదై దుఃఖముల ననుభవింప వలసి యుండును.

అట్లు లేక వారమున కొకతూరిగాని, పదిహేను దినముల కొకతూరిగాని, మాసమున కొకతూరిగాని పాత్ర లను శుద్ధి పరచినచో మలినము తొలగుట కష్టసాధ్యము. ఆలాగుననే వారమున కొకతూరిగాని, పదిహేను దినముల కొకతూరిగాని, మాసమున కొకతూరిగాని స్తోత్ర ధ్యానములు సలిపినచో హృదయమునందు మలినము లయిన విషయ వాసనలు తొలగుట మహాకష్టము. కావున ఇంతవరకు చెప్పినప్రకారము ప్రతిరోజును ఉదయమున లేచి నిత్య కృత్యములను దీర్చుకొని స్తోత్ర ధ్యానములచే భగవంతుని ధ్యానించినచో మలినములైన విషయవాసనలు మాయమై అంతఃకరణము శుద్ధి యగును. మనస్సు నిర్మల మగును. శాంతి కలుగును. దుఃఖములు తొలగిపోవును. ఇట్లు ప్రతి నిత్యమును శ్రద్ధతో సలుపుటవలన మనకెంత లాభకరమో గమనించుడు.

ఇట్లు "ఎవరు శ్రద్ధా భక్తులతోను, అత్యంత ప్రేమ తోను, ప్రతి నిత్యమును నన్ను నమ్మి ధ్యానించుచున్నారో

అట్టివారి యోగ క్షేమములను నేనే నిర్వహించుచున్నాను" అని శ్రీకృష్ణభగవానుడు 9 అ॥ 22 శ్లో॥ స్వయముగా చెప్పియున్నాడు. కావున మనము ప్రతినిత్యమును భగవ ధ్యానమును సల్పుటయే తపస్సు అనబడును. అట్లు ధ్యానించుటవలన తప్పక దుఃఖములు నశించి, ఇహమునందు సుఖము, పరమునందు నిత్య సుఖము గలుగును. ఇంత కంటె సులభమైన మార్గ మింకొకటి లేదు.

సోదర సోదరీమణులారా !

ఇంతవరకు మన జీవితము లెన్నియో గడిచినవి. ఈ సంసార కోలాహలమునందు ఎన్నియో యిక్కట్లకు పాటుపడితిమి. ఎన్నియో దుఃఖముల ననుభవించితిమి. ఇంకను మన ప్రారబ్ధకర్మములచే దుఃఖము లెన్ని యనుభ వించవలయునో తెలియదు. కావున నికనైనను జాగ్రత పడుడు ! మన తలిదండ్రులను జేరు మార్గము వెదకుడు. ప్రతి నిత్యమును మిమ్ముల ననుసరించి యుండు సోదర బృందములతో కలిసి దైవప్రార్థనలను సలుపుడు.

మహనీయులారా !

మానవ జన్మము చాలా ఉత్తమమైనది. పవిత్రవంత మైనది. ఇట్టి ఉత్తమమైన జన్మము వచ్చినందులకు ప్రతి వారును తమ జీవిత రహస్యమును దెలిసికొని ప్రతి నిత్య

మును బ్రహ్మ ముహూర్తమున మేల్కాంచి నిత్యకృత్యములను దీర్చుకొని స్తోత్ర ధ్యానములను జేయుచు రాగా రాగా చిత్తశుద్ధి గలుగును. నిర్మలమైన జ్ఞానము గలుగును. మనస్సున కానందము గలుగును. అప్పుడు ధన్యుల మగుదుము. భగవదనుగ్రహమునకు పాత్రుల మగుదుము. లోకమున కుపకారము జేసినవార మగుదుము. ఇందుకు వలయు శ్రద్ధ, భక్తి, జ్ఞానము, భూతదయ మనకు పరమేశ్వరు డొసగుగాక!

ఇట్లు

సర్వజన శుభాభిలాషి,

పండిత, మాకం తిమ్మయ్య శ్రేష్ఠి.

---

ఓమ్.

# భగవన్నామ స్తోత్ర మహిమ

దైవాత్మ స్వరూపులారా !

మొట్టమొదట మనయందు భక్తి లేదే యను చింత యక్కఱలేదు. భక్తి యుదయించుటకు సులభమైన రాజ బాట యొకటి కలదు. అది యేది యనగా, భగవంతుడు ప్రేమస్వరూపుడు. జీవకోటి యంతయు భగవదంశము కావున మనయందు సహజముగానే ప్రేమ యున్నది. భూతకోటిలో ఆత్మరక్షణయందు ప్రేమ లేనిది కలదా? మన ప్రేమ భార్యా పుత్రాదులయందు విశేషముగా వాడుచున్నాము కదా? అట్టి ప్రేమ భగవంతునియం దుంచితిమేని అదియే భక్తి యనబడును. కావున మన మీ ప్రేమను ఎచ్చటనుండియో కొని తేవలసిన పనిలేదు. ఏ బజారునందును దొరుకునది కాదు. అది సహజముగా మనయందే కలదు.

కనుకనే అన్నిమార్గములకంటెను భక్తి మార్గము మహా సులభమైనది. తనయందలి ప్రేమగుణమును భగవంతుని కర్పించి మృగమైన గజేంద్రుడును, పక్షియైన జటాయువును, బాలుడైన ధ్రువుడును, రాక్షసాంశమైన ప్రహ్లాదుడును, గొల్లలైన గోపికాస్త్రీలును, ఇంకను అనేక మంది మహాత్ములును ముక్తి పొందియున్నారు. ఆలాగుననే మనముకూడ ప్రేమగుణము భగవంతుని కర్పించవచ్చును.

కాని సహజముగ మనకు విషయములందుండు ప్రేమను భగవంతునిపై యెట్లు త్రిప్పుట యని యోచన గల్గును. మన తలిదండ్రులయందును, భార్యా పుత్రాదులయందును, ఇతర వస్తువులయందును గల ప్రేమను ఏ గ్రంథములను జూచి నేర్చినాము? ఎవరు దాని లక్షణములను బోధించినారు? క్రొత్త వారితో పదిరోజులు మనము కలిసియున్నచో సహజముగా వారియెడల మనకు ప్రేమ జనించుటలేదా?

అట్లే భగవన్నామమునకును, భగవంతునికిని గల భేదము. కనుక మనము కొంతకాలము ప్రతి నిత్యమును తప్పక శ్రద్ధతోను, ప్రేమతోను ధ్యానించుచు రాగా రాగా ఆ అభ్యాసమే అత్యంతరుచిని, ప్రేమను పుట్టించి, మన మిప్పు డూహింపజాలని ఆనందమును గలుగ జేయును. తుదకు, అట్టి ఆనందమును విడిచి రసములేని తుచ్ఛమైన ఐహికసంబంధములైన యింద్రియ సుఖములందు విరక్తిని గలుగజేయును. భగవన్నామము మనకు భగవంతుని యెడలనే గాక యితర జీవులయందును ప్రేమ నుదయింపజేయును. భగవంతునియందు గాఢ విశ్వాసమును జనింపజేయును. భక్తిని వృద్ధిజేయును. మన భారము లన్నియును ఆయనపై వేసిన నిర్భరుడుగను, నిర్భయుడుగను నుండజేయును. మొదలనే ప్రేమ జనించకున్నను భయము లేదు. స్వామికార్యము లెప్పుడును వ్యర్థములు కానేరవు. మనకు తెలియకనే మొలకెత్తి ఫలించును. ఎన్ని కల్పము

లయినను ఎండిపోవు. నామస్మరణమువలన మనస్సు నిర్మలము కాగలదు. అప్పుడు మనతండ్రి ఒక నిమిషమైనను ఆలస్యము జేయక ప్రేమ నుదయింపజేయును.

ఏ వస్తువును గురించి మన మెక్కువగా చింతించెదమో ఆ వస్తువునందే ప్రేమ జనించుట సహజముకదా? కనుక భగవంతుని స్తోత్రధ్యానము జేయగా జేయగా మన హృదయమందు విషయ మాలిన్యము తొలగును. ప్రేమ జనించును; వృద్ధి పొందును; సముద్రమువలె పొంగును. కట్టలు త్రెంచుకొని పొర్లివచ్చి ఇతర క్షేత్రములకు ప్రవహింపజేయును. భక్తవత్సలుడయిన భగవంతుని నామమును ధ్యానించుకొలది మన హృదయమందు, తనయందు భక్తి ప్రేమ లుదయింప జేయును. తన్ను జేరు మార్గములను తెలియజేయును. మనస్సు అట్టి మార్గములయందు బోవుటకు ప్రేరేపించును. అట్టివాని యోగక్షేమముల భార మంతయు తనపైననే వేసికొనును. ఈ విధముగా భక్తుడు తన్ను జేరువరకు నన్నివిధముల చేయి పట్టుకొని నడిపించుకొని పోవును.

హరి నెఱింగినవాడు అన్నియు నెఱింగినవాడే యగును. కావున ప్రతినిత్యమును తప్పక మనము ఏకాంతమున శ్రద్ధగలవారమై, ఏ యితర చింతలు లేక నిర్మల మనస్సుతో హరినామము స్తోత్రధ్యానములు సల్పుచుండిన

వంటి శరీరము గలవాడును, అయిన శ్రీరామమూర్తిని నాహృదయ పద్మమున ప్రతిష్ఠింపజేసికొని ఎల్లప్పుడును సోహం, సోం సోహం అను మంత్రముచే ధ్యానించుచుందును.

ముక్తేర్మూలం మునివర హృదానందకందం ముకుందం
కూటస్థాఖ్యం సకలవరదం సర్వచైతన్యరూపమ్,
నాదాతీతం కమలనిలయం నాదనాదాంతతత్త్వం
నాదాతీతం ప్రకృతిరహితం రామచంద్రం భజేఽహమ్.

తా॥ అనన్యభక్తితో ధ్యానించుచున్న భక్తుల హృదయపద్మమునందు నివసించి ఆనందింపజేయువాడును, ముకుందుడును, ఆత్మస్వరూపుడై నివసించు కూటస్థుడును, భక్తులకోర్కెలను నెరవేర్చువాడును, నాదనాదాంతము గలవాడును, ప్రకృతిరహితుడును, జ్ఞానస్వరూపుడగు శ్రీరామమూర్తిని ఎల్లప్పుడును ధ్యానించుచున్నాను.

ఓతప్రోతసమస్తవస్తునిలయం చోంకారబీజాక్షరం
ఓంకారప్రకృతిం షడక్షరహితం చోంకార కందాంకురమ్,
ఓంకారస్ఫుటభూర్భువస్సువరితం త్ర్యేఘత్రియారాధితం
ఓంకారోజ్జ్వలసింహపీఠనిలయం రామంభజేతారకమ్,

తా॥ పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రపంచమునందుగల చరాచరముల యందును, ఆత్మస్వరూపుడై నివసించువాడును, క్షరాక్షర స్వరూపుండును, ఓంకార స్వరూపుండును, షడాక్షరములతో గూడిన మంత్రముచే ధ్యానింపదగినవాడును, ఓంకారమునకు మూలమైనవాడును, భూః భువః, సువః అను వ్యాహృతు

లతో గూడినవాడును, దేవతలచేతను, సిద్ధులచేతను, మానవుల చేతను, ధ్యానింపదగినవాడును, ఓంకారమను సింహాసనమందు ప్రకాశించువాడును అయిన శ్రీరామమూర్తిని ధ్యానించుచున్నాను.

భ్రూమధ్యేనిగమాగమోజ్జ్వలపదే చంద్రే త్రిమార్గాంతరే
నిర్ద్వంద్వే నిఖిలార్థతత్త్వవిలసత్సూక్ష్మే సుషుమ్నాముఖే,
ఆసీనం ప్రళయార్కభాసురపరంజ్యోతి స్స్వరూపాత్మకం
వర్ణాభ్యంచిత మోక్షలక్ష్మి సహితం రామం భజే తారకమ్.

తా॥ వేదశాస్త్రములచే తెలియబడిన ఓంకారస్వరూపుడును, చంద్రసూర్యాగ్నులను ప్రకాశింపజేయువాడును, సూక్ష్మస్వరూపముతో నిఖిలార్థములను ప్రకాశింపజేయువాడును, భ్రూమధ్యమున దృష్టినిలిపి అంతరదృష్టిచే దర్శింపదగినవాడును, సుషుమ్నాది నూర్ధ్వముఖంబున పరంజ్యోతి స్వరూపుడై సమస్తగుణములచే కొండాడబడుచున్న మోక్షలక్ష్మితోగూడి ఆనంద స్వరూపుడైన తారక రామమూర్తిని ధ్యానించుచున్నాను.

వందే రామ మనాదిపూరుష మజం వందే రమానాయకం
వందే హారకిరీటకుండలధరం వందే సునీలద్యుతిమ్,
వందే చాపకలంబకోజ్జ్వలకరం వందే జగన్మంగళం
వందే పఙ్క్తిరథాత్మజం మమగురుం వందే సదా రాఘవమ్,

తా॥ ఆదిమధ్యాంతములు లేనివాడును, పుట్టుకలేనివాడును మోక్షలక్ష్మికి నాయకుడును, మకరకుండల కిరీట కేయూర హార ములతో శోభించు చుండువాడును, మంచి నీలములవంటి కాంతి గలవాడును, ధనుర్బాణములు ధరించిన జగన్మోహన మంగళ

స్వరూపుడును నాకు సద్గురుమూర్తి అయిన రఘురాముని ధ్యానించుచున్నాను.

వందే శౌనకగౌతమాద్యభినుతం వందే ఘనశ్యామలం
వందే తారకపీఠమధ్య నిలయం వందే జగన్నాయకమ్,
వందే భక్తజనౌఘదైవతతరుం వందే ధనుర్వల్లభం
వందే తత్త్వమసీతివాక్యజనకం వందే సదారాఘవమ్.

తా॥ శౌనకాది మహామునులచేతను, గౌతముడు మొదలగు తపోనిధులచేతను కొనియాడబడువాడును, మేఘముపలె నల్లని చాయగలవాడును, రెండక్షరములచే కూడిన తారకమను పీఠ మధ్యమున ప్రకాశించువాడును, సకలలోకములకు నాయకుడును, తన్ను నమ్మినభక్తులకు కల్పవృక్షమువంటి వాడును, "తత్వమసి" యను రూపము గలవాడును, ధనుస్సును ధరించిన నా సద్గురుమూర్తియగు రామమూర్తిని ధ్యానించుచున్నాను.

వందే సూర్యశశాంకలోచనయుగం వందే జగత్పావనం
వందే పత్రి సహస్రపద్మనిలయం వందే పురారిప్రియం
వందే రాక్షసవంశనాశనకరం వందే సుధాశీతలం
వందే దేవకవీంద్రకోటి వినుతం వందే సదా రాఘవమ్.

తా॥ సూర్యచంద్రులతో సమానమైన కన్నులు గలవాడును లోకములను పవిత్రము జేయువాడును, సహస్రదళముల మధ్యమందు ప్రకాశించుచున్న మహేశ్వరుడును, రాక్షసాధములను నశింపజేసి, చల్లని చూపు గలవాడును, వానరులుగా అవతరించిన కోట్లకొలది దేవతలచే కొనియాడబడువాడును అయిన శ్రీరామ మూర్తిని ఎల్లప్పుడును ధ్యానించుచున్నాను.

వందే సాగర గర్వభంజక శరం వందే జగజ్జీవనం
వందే కౌశికయాగ రక్షణకరం వందే గురూణాం గురుమ్.
వందే బాణశరాసనోజ్జ్వలకరం వందే జటావల్కలం
వందే లక్ష్మణభూమిజాన్విత మహం వందే సదా రాఘవమ్.

తా॥ సముద్రుని గర్వము నణచినవాడును, సకలలోకము లను రక్షించువాడును, విశ్వామిత్రుని యాగసంరక్షణ చేసినవాడును, గురువులకు గురువై, జడలు, నారవస్త్రములు ధరించి శరచాపములు, హస్తముల ధరించి సీతాలక్ష్మణ సహితుడై ప్రకాశించు రఘురాముని ధ్యానించుచున్నాను.

వందే పాండర పుండరీకనయనం వందేఽబ్జబింబాననం
వందే కంబుగళం కరాబ్జయుగళం వందే లలాటోజ్జ్వలం.
వందే పీతదుకూల మంబుదనిభం వందే జగన్మోహనం
వందే కారణమానుషోజ్జ్వలతనుం వందే సదా రాఘవం.

తా॥ తెల్లని తామరకములవంటి కన్నులు గలవాడును చంద్రబింబముతో సమానమైన ముఖము గలవాడును, శంఖము వంటి కంఠము గలవాడును, పద్మములవంటి చేతులుగలవాడును, ఫాలనేత్రమువంటి బొట్టుచే ప్రకాశించువాడును, పీతాంబరము ధరించినవాడును, నీలమేఘమువంటి కాంతితోగూడిన శరీరము గలవాడును, జగత్తును మోహింపజేయువాడును, మానవ రూపము ధరించి ప్రకాశించుచున్న రఘురాముని ఎల్లప్పుడు ధ్యానించుచున్నాను.

వందే నీల సరోజకోమలరుచిం వందే జగద్వందితం
వందే సూర్యకులాబ్ధికౌస్తుభమణిం వందే సురాధిరాతమ్,
వందే పాతకపంచకప్రహరణం వందే జగత్కారణమ్
వందే వింశతి పంచతత్త్వరహితం వందే సదా రాఘవమ్.

తా॥ నల్లని కలువవలె కోమలమైన కాంతి గలవాడును, లోకములచే స్తుతింపదగినవాడును, పూజింపదగినవాడును, సూర్య వంశ మను కౌస్తుభమణితో సమానముగ ప్రకాశించువాడును, పంచమహాపాతకముల హరింపజేయువాడును, లోకములను, సృష్టికి కారణమై ఇరువదిఅయిదు తత్వములతో గూడిన ప్రకృతికి అతీతమై ప్రకాశించు రఘురాముని ఎల్లప్పుడును ధ్యానించు చున్నాను.

వందే సాధకవర్గ కల్పకతరుం వందే త్రిమూర్త్యాత్మకం
వందే నాదలయాంతరస్థలగతం వందే త్రివర్గాత్మకమ్,
వందే రాగవిహీనచిత్తసులభం వందే సభానాయకం
వందే పూర్ణదయామృతార్ణవ మహం వందే సదా రాఘవమ్.

తా॥ సాధులపాలిటి కల్పవృక్షమును, త్రిమూర్తి స్వరూపుండును, నాద లయ మధ్యస్థలమందు సూక్ష్మరూపుడును, ధర్మార్థ కామ మోక్షస్వరూపుడును, రాగద్వేషములులేని నిర్మలమనస్సు గలవాడును, భక్తులకు సులభుడును, సభానాయకుడై ప్రకాశించు వాడును, పరిపూర్ణ ప్రేమ యనెడు యమృతమునకు దయాసముద్రుడును అయిన శ్రీరామమూర్తిని ధ్యానించుచున్నాను.

వందే సాత్త్వికతత్త్వముద్రిత తనుం వందే సుఖాదాయకం
వందే చారుచతుర్భుజం మణినిభం వందే షడబ్జస్థితం,
వందే బ్రహ్మపిపీలికాదినిలయం వందే విరాడ్విగ్రహం
వందే పన్నగతల్పశాయిన మహం వందే సదా రాఘవం.

తా॥ శుద్ధ సాత్త్వికగుణముచే ప్రకాశించుచున్న శరీరము గలవాడును, శాశ్వతమైన మోక్షసుఖము నిచ్చువాడును, చతుర్భుజములు గలవాడును, నవరత్నములతో సమానముగా ప్రకాశించువాడును, షట్చక్రముల కాధారమై, సమస్తలోకములను తన కుక్షియందు నివసింపజేసికొని విరాట్స్వరూపుడై, శేషతల్పము నందు పరుండువాడును, అగు శ్రీరామమూర్తిని ఎల్లప్పుడును ధ్యానించుచున్నాను.

అచింత్య మవ్యక్త మనంతరూప
మద్వైత మానంద మనాది గమ్యం,
పుణ్యస్వరూపం పురుషోత్త మాఖ్యం
రామం భజే రాఘవ రామచంద్రం.

తా॥ ఆలోచింపరానివాడును, తెలియవగినవాడును, అంతము లేని రూపము గలవాడును, తనకు రెండవది లేనివాడును, ఆనంద స్వరూపుడును, ఆదిలేనివాడును, ఆనందము పొందవగినవాడును, పుణ్యస్వరూపుడును, పురుషోత్తముడును అగు శ్రీరామ చంద్ర ప్రభువును ధ్యానించుచున్నాను.

నమో నమ స్తేఽఖిల పూజితాయ
నమో నమశ్చంద్ర నిభాననాయ,

నమో నమస్తే రఘువంశజాయ
నమోస్తు రామాయ సలక్ష్మణాయ.

తా॥ ఎల్లరచేతను పూజింపబడువాడును అయిన రఘురామునికి నమస్కరించుచున్నాను. చంద్రునితో సమానమైన మోము గలవాడును అయిన రామా! నీకు నమస్కారము. రఘువంశోద్ధారకుడవై అవతరించిన రామమూర్తీ! నీకు నమస్కారము. ఎల్లప్పుడును లక్ష్మణునితో గూడియుండు రఘుకులతిలకా! ఓ రామచంద్రమూర్తీ! నీకు నమస్కరించుచున్నాను.

శ్రీరామ పాదుకా స్తవము

స ం పూ ర్ణ ము

---

## మ హా వా క్య ము లు.

# అష్టోత్తర శత మనన స్తోత్రము.

అహమేకోపి సూక్ష్మంచ జ్ఞాతా సాక్షీ సదా వ్యయః 1
బ్రహ్మైవాహం మనశ్శాంత సచ్చిదానంద లక్షణః 2
నిర్వికారో నిరాకారో నిరవద్యోహమద్వయః 3
నిరామయో నిరాభాసో నిర్వికల్పో హమాతతః 4
నిర్గుణో నిష్క్రియో నిత్యోనిత్య ముక్తోహ మచ్యుతః 5
నిర్మలో నిశ్చలోనంతః శుద్ధోహ మజరో మరః 6

అహ మాకాశ వత్సర్వం బహింతర్గతోచ్యుతః 7
సదా సర్వ సమస్సిద్ధో నిస్సంగో నిర్మలోచలః 8
అసంగోహ మనంగోహ మలింగోహ మభంగురః 9
ప్రశాంతోహ మనంతోహ మమలోహం చిరంతనః 10
అకర్తాహ మభోక్తాహ మవికారోహ మక్రియః 11
శుద్ధబోధస్వరూపోహం కేవలోహం సదాశివః 12
నిత్యశుద్ధ విముక్తోహం అఖండానంద మద్వయః 13
సాక్ష్యహం సర్వదా నిత్య శ్చిన్మాత్రోహం సదాశివః 14
సర్వోపాధి వినిర్ముక్తం సదా ద్వైత మానందం నిజబోధః
అవస్థాత్రయ భావాభావసాక్షిస్వయం సత్తామాత్రః 16
సదా సర్వగతో దేవః స్థిరః పూర్ణో నిరంతరః 17
అహమాత్మా నిరాకార స్సర్వవ్యాపి స్వభావతః 18
బ్రహ్మైవాహం సదాద్వైతం శుద్ధజ్ఞాన నిర్మలః 19
అహమేవ సదానంద శ్శుద్ధో విజ్ఞాన విగ్రహః 20
నిత్యం సుఖం నిష్కల మప్రమేయం అరూప మవ్యక్తః 21
అనాఖ్యమవ్యయం జ్యోతిస్స్వయం స్వప్రకాశైకరూపః 22
జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ శూన్యం సత్యబోధ సుఖరూపః 23
నిర్వికల్పం కేవల చిన్మాత్రోహం అపరోక్ష స్వరూపః 24
ఆధారాధేయరూపోహం అవృత్తి వృత్తిసాక్షి చైతన్యరూపః
అహమేకం మిదం విశ్వం వ్యోమాకారం నిరంతరః 26
నిత్యానందైకరసం ప్రత్యగభిన్నం దేహత్రయవిలక్షణః 27
అనాదితత్వం త్వమహ మిద మద ఇతి కల్పనాదూరః 28

రూపం నాహం నామ నాహం నకర్మ సచ్చిదానందరూపః
సర్వత్ర సర్వదా సర్వమహ మేకో నిరంతరః 30
తత్వమసీత్యాది మహావాక్య లక్ష్యార్థ స్వరూపః 31
వ్యష్టి సమష్ట్యుపాధిరహిత బోధానంద ఘనస్వరూపః 32
నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాత శ్శుద్ధః 33
శాశ్వతానంద రూపోహం సర్వవేదాంత వేద్యః 34
అప్రమేయం అమృతత్వం మనోవాచామగోచరః 35
అవ్యక్తాది సృష్టి ప్రపంచేషు వ్యాప్య పూర్ణ మవినాశః 36
సూక్ష్మా త్సూక్ష్మతర పరంజ్యోతీరూపం పరమపురుషః 37
పురాణోరణురూపోహం ఆదిమధ్యాంత విహీన మేకః 38
ప్రణవస్వరూపోహం అద్వితీయ మనపద్య మసంగః 39
ప్రజ్ఞానైక రసోహం జ్ఞాతృ జ్ఞానం జ్ఞేయ విహీనపరః 40
న బద్ధోనైవ ముక్తోహం స్వభావనిర్మల బ్రహ్మపురుషః 41
అహం బ్రహ్మాస్మీత్యాకారం సత్య బుద్ధ ముక్తః 42
అచింత్య మవ్యక్త మనంతరూపం స్వయంబ్రహ్మమయః 43
నజాతోహం మృతో వాపి నమేకర్మ నిరాశ్రియః 44
చిదానంద మరూప మద్భుతోహం త్రిపరిచ్ఛేద వర్జితః 45
పరసచ్చిత్సుఖరూపోహం అమాయం సర్వాఖ్యారహితః 46
సర్వేంద్రియ వివర్జితం నిత్యకైవల్యం సదాత్మరూపః 47
అకార ఉకారో మకారజ్యోతిర్ జ్యోతి స్వయం జ్యోతి
ర్మయః 48

సద్ఘనం చిద్ఘనం నిత్యమానంద ఘనం ప్రికృదే సాక్షి రూపః 49
సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత పూర్ణాకారః 50
బ్రహ్మైకరూపోహం సదా విముక్తోస్మి సదైకరూపః 51
వ్యోమేవపూర్ణోఽస్మి విమలోస్మి చిదేవ కేవలః 52
విదేహం గగనాకారం నిత్యవిశుద్ధ స్వభావతః 53
కేవలం అద్వితీయం బ్రహ్మైవాహం వేద్య వేదకవర్జితః 54
దహనపవనహీనం సలిల పృథ్వీహీనం విజ్ఞాన మేకః 55
జ్ఞానామృతం శుద్ధమతీంద్రియోహం నచ భూతసంఘః 56
పూర్ణోఽనిత్యయేక శ్శివోహం ధారణా ధ్యాన నిర్ముక్తః 57
మోక్షానందైక సింధురేవాహం సూక్ష్మోహ మక్షరః 58
విగళిత గుణజాల కేవలాత్మాహం సర్వసాక్షి స్వరూపః 59
కూటస్థ చేతనోహం స్వస్వరూపం వేదవేదాంత లక్ష్యః 60
నిర్మల నిర్వాణమూర్తి రేవాహం నిరపాయ వోహ మజః 61
అహంధ్యాతా పరంధ్యేయ మఖండ ఖండరహితః సర్వ మేకః 62
కేవల సన్మాత్రసార భూతోహం నిజబోధ స్వతంత్రితః 63
పరమానందైక భూమోహం అఖండానందపూర్ణః 64
బుద్ధోముక్తోయ మద్భుతాత్మాహం శుద్ధోహమద్వయః 65
ఏకోహం సంపూర్ణ భావాభావవిహీన కైవల్యజ్యోతిర్మయః
శాశ్వతవిజ్ఞాన సమరసాత్మాహం స్వభావ నిర్మలః 67

అనంత సహరస మేకోహం భోజ్యం భోక్తా భోగశ్చ
విలక్షణః 68
ఆదిశూన్యోహం నిరుపమం త్రిపుటీశూన్యం అశూన్యః 69
స్వరూపనిర్వాణ మయోహం బహిరంతరవర్జిత సర్వసమః
కేవలతత్వ నిరంజనోహం సదా లక్ష్యాలక్ష్య వివర్జితః 71
శుద్ధాద్వైత పరాత్పరోహం నిత్యనిర్మల నిశ్చల గగనాకారః
సహజానందోహం గమనాగమన వినిర్ముక్తో నిర్వికల్పో
నిరాకులః 73
భావాభావ వినుర్ముక్త మంతరాళం దినరాత్రి భేద వివర్జితః
నిర్గుణం శుద్ధ మవ్యయం అశరీరం సమం తత్వం సర్వ
బ్రహ్మమయః 75
చైతన్యం దోషరహితం సర్వజ్ఞం పూర్ణమేవాహం గగ
నోపమః 76
సర్వవివర్జిత సర్వసమోహం కారణకార్య విహీనసమః 77
గురుశిష్య వివర్జిత తత్వపదోహం నిరంతర సర్వ శివః 78
ద్వైతాద్వైత వివర్జితోహం నిత్యముక్త పురుషోహ కేవలః 79
అహమేవ సదా సర్వమేకం నిరంతరం సర్వమాత్మైవ 80
అహమేవ సదా నిత్యో క్షుత్పిపాసాది షడూర్మిదూరః 81
అపాణి పాదోహ మవాగ చక్షుర ప్రాణ విచిత్ర పురాతనః
నిత్యోహం విశుద్ధాంతఃకరణ ముముక్షు జనానుభవవేద్యః 83
అవ్యయం అఖిలోపాధి వినిర్ముక్తం అనాద్యనంతం శుద్ధం
శివం శాంతః 84

దేశకాల వస్తు పరిచ్ఛేద రాహిత్య చిన్మాత్రం సూక్ష్మతత్వ
రహస్యః 85

ఉత్పత్తివినాశ షడ్భావ వికారాది రహితోహం అనిధి
వినిర్ముక్తపరః 86

సత్యం జ్ఞాన మనంతం ఆనందం సర్వశరీరోపాధ్యః 87

సర్వాత్మా సర్వరూప శ్చ సర్వాతీతోహం అనంతమవ్యయః
సర్వకల్పనాధిష్ఠానం సర్వప్రకాశకం సర్వగతం
నిరావరణచిన్మాత్రః 89

నిర్విశేష చిన్మాత్రోహం సదద్వైత మానందం సర్వ
జగదానంద లక్షణః 90

అనిర్వచనీయ స్వయంజ్యోతి స్స్వరూపోహం నిరతిశయః

ప్రమేయాది త్రియసాక్ష్యహం సూక్ష్మం ప్రమేయాది
విలక్షణః 92

యద్వాచానభ్యుదితం యేనవాగభ్యుద్యతేతదేవాహ మాతతః

యన్మనసానమనతే యేనాహుర్మనో మతం తదేవాహ
మద్వయః 94

యచ్చక్షుషా న పశ్యతియేన చక్షూంషి పశ్యతి తవాహ
మచ్యుతః 95

యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్ర మిదం శృతం
తదేవాహ సర్వగతః 96

యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే
తదేవాహ మనామయః 97

సర్వత్ర మఖండైక రసోహం గగనాకారం అహ
మేకో నిరంజనః 98

నేతి నేతీతి నేతీతి శేషితం యత్పరం పదం తదస్మి
పరాపరః 99

స్థాణుర్నిత్య సదానంద శుద్ధో జ్ఞానమయో మలః 100

ఆకాశవన్నిర్మల నిర్వికల్ప నిస్సీమ నిష్పంద ననిర్వికారః

అద్వితీయ పరిచ్ఛిన్న సచ్చిదానంద మూర్తిః 102

నిత్యానందో నిత్యదాతా నిర్మలోహం చిదాత్మస్వరూపః 103

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే
తదేవాహ నిరాకులః 104

పరిజ్ఞానమేవత ద్బ్రహ్మే త్యుపదేష్టాహ మీశ్వరః 105

బోధానందైకమూర్తి రేవాహం కేవలాఖండ చిన్మాత్రరూపః

ఆత్మాహం సర్వభూతానాం విభుస్సాక్షీ న సంశయః 107

జ్ఞానామృతం శివోహం బ్రహ్మైవాహం సచ్చిదానంద
రూపః 108

హరిః ఓమ్.

---

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

ఓమ్ స్ఫటికరజితవర్ణం మౌక్తికీ మక్షమాలామ్
అమృతకలశవిద్యాం జ్ఞానముద్రాం కరాగ్రే
దధతమురగకక్ష్యం చంద్రచూడం త్రినేత్రమ్
విధృత వివిధభూషం దక్షిణామూర్తిమీడే ॥౧॥

తా॥ స్ఫటిక రజితములవంటి స్వచ్ఛమైన వర్ణము గలవాడును, ముత్యములతో చేయబడిన జపమాలను ధరించినవాడును, అమృతకలశము గైకొనిన వాడును, విద్యానిధియు, హస్తముల చివర చిన్ముద్ర ధరించినవాడును, కక్ష్యభాగమున సర్పములు గలవాడును, శిరస్సుపై చంద్రుడు యొప్పుచున్న వాడును, త్రినేత్రుడును, పెక్కు భూషణముల ధరించినవాడు నగు శ్రీ దక్షిణామూర్తిని స్తుతించెదను.

ఓమ్ ముద్రాం భద్రార్థధాత్రీం స పరశుహరిణం
బాహుభిర్బాహుమేకం । జాన్వాసక్తం దధా
నో భుజగబిలసమాబద్ధకక్ష్యోవటాధః । ఆసీన
శ్చంద్రఖండ ప్రతిఘటితజటాక్షీర గౌరస్త్రి
నేత్రో । దద్యాదాద్య శ్శుకాద్యై ర్మునిభిరభి
వృతో భావశుద్ధిం భవో నః ॥౨॥

తా॥ శుభార్థముల నొసంగు చిన్ముద్రను ధరించినవాడును, పరశుహరిణంబుల చేబూనివాడును, మోకాలిపై నొక హస్తము నుంచుకొనిన వాడును, కక్ష్యభాగమున సర్పములచే జుట్టబడిన వాడును, వటవృక్షముక్రింద నాసీనుడును, చంద్రఖండం బొప్పు

చున్నట్టి జటాజూటము గలవాడును, క్షీరమువలె స్వచ్ఛమైన కాంతి గలవాడును, త్రినేత్రుడును, సనాతనుడును, శుకాది మునులచే స్తుతింపఁబడువాడునగు శ్రీ దక్షిణామూర్తి మాకు భావ శుద్ధిని గలుగచేయు గాక !

ఓమ్ భస్మవ్యాపాండు రంగశ్శశికలధరో జ్ఞానము
దాక్షమాలా । వీణాపుస్తైర్విరాజత్కర కమ
లధరో యోగపట్టాభిరామః । వ్యాఖ్యాపీఠే
నిషణ్ణో మునివరనికరైః స్సేవ్యమానః ప్రస
న్నః । సవ్యాళః కృత్తి సావాస్సతత మవతు
నో దక్షిణామూర్తిరీశః ॥ ౩ ॥

తా॥ భస్మధారణచే తెల్లని కాంతిగలవాడును, చంద్రశేఖరుఁడును, జ్ఞానముద్రను చేబట్టినవాడును, జపమాలను ధరించిన వాడును, వీణాపుస్తకములు విరాజిల్లు కరకమలములు గలవాడును, యోగ పట్టాభిషిక్తుడును, భక్తుల హృదయములందు రమించువాడును, వాక్కుపీఠమున నాసీనుఁడును, శ్రేష్ఠమైన మునుల సముదాయముచే సేవింపబడువాడును, ప్రసన్నచిత్తుడును, సర్పముల ధరించినవాడును, ఏనుగుచర్మము వస్త్రముగా గలవాడును, ఈశ్వర స్వరూపుడు నగు శ్రీ దక్షిణామూర్తి మమ్ము నిరతము బ్రోవుగాక !

ఓమ్ వీణాంకరైః పుస్తకమక్షమాలాం బిభ్రాణ
మభ్రాభగళం వరాఢ్యమ్ । ఫణీన్ద్రకక్ష్యం
మునిభిశ్శుకాద్యైస్సేవ్యం వటాధః కృత
నీడమీడే ॥ ౪ ॥

తా॥ హస్తములయందు వీణ, పుస్తకము, జపమాలను ధరించినవాడును, మేఘకాంతివలె నీలమైన ఉత్తమ కంఠప్రదేశముచే భాసిల్లువాడును, కక్ష్యభాగమున నాగేంద్రము గలవాడును, శుకాదిమునులచే స్తుతింపబడువాడును, వటవృక్షముక్రింద నివాసమేర్పరచుకొనినవాడు నగు శ్రీ దక్షిణామూర్తిని స్తుతించెదను.

ఓమ్ ముద్రాపుస్తకవహ్నినాగ విలసద్బాహుం
ప్రసన్నాననమ్ ।. ముక్తాహారవిభూషణం శశి
కళా భాస్వత్కిరీటోజ్జ్వలమ్ । అజ్ఞానాపహ
మాదిమాది మగిమర్థం భవానీపతిమ్ । న్య
గ్రోధాస్త నివాసినం పరగురుం ధ్యాయామ్య
భీష్టాప్తయే ॥౫॥

తా॥ చిన్ముద్ర, పుస్తకము, అగ్ని, సర్పము—ఇవి హస్తములందు గల్గి ప్రకాశించువాడును, ప్రసన్న ముఖుడును, ముత్యాలహారములే భూషణములుగా గలవాడును, చంద్రకళలచే ప్రకాశించుచున్న ఉజ్జ్వలకిరీటముచే నొప్పువాడును, అజ్ఞానమును బోగొట్టువాడును, ఆదిపురుషుడును, ప్రణవార్థ స్వరూపుడును, పార్వతీపతియు, వటవృక్షము క్రింద నివసించువాడును, పరమగురువు శ్రీ దక్షిణామూర్తిని అభీష్టసిద్ధికొఱకు ధ్యానించెదను.

ఓమ్ యోగీన్ద్రహృదయామ్భోజ నిషణ్ణ మపవర్గ
దమ్ । నమామి దక్షిణామూర్తిం ప్రణవా
త్మ స్వరూపిణమ్ ॥౬॥

తా॥ యోగీంద్రుల హృదయకమలముల వసించువాడును మోక్షము నొసంగువాడును, ప్రణవాత్మస్వరూపుడునగు శ్రీదక్షిణామూర్తికి నమస్కరించెదను.

ఓమ్ నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్ర
దాయకర్తృభ్యో । వంశఋషిభ్యో మహద్భ్యో
నమో గురుభ్యః ॥౭॥

తా॥ చతుర్ముఖ బ్రహ్మ మొదలుగాగల బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తలును, ఋషివంశీయులు నగు గురువులకు నమస్కారము.

ఓమ్ నమశ్శ్రుతిశిరః పద్మషండమార్తాండ మూర్తయే
బాదరాయణ సంజ్ఞాయ మునియే శివవేశ్మనే ॥౮॥

తా॥ ఉపనిషత్తులను పద్మసమూహమునకు సూర్యుడును, బాదరాయణుడను పేరుగలవాడును, మంగళత్వమునకు నిలయుడును నగు శ్రీ వ్యాసమునికి నమస్కారము.

ఓమ్ నారాయణం నమస్కృత్య నరంచైవ నరో
త్తమమ్ । దేవీం సరస్వతీం వ్యాసం తతో
జయముదీరయేత్ ॥౯॥

తా॥ శ్రీమన్నారాయణునకును, నరులలో నుత్తమునకును, శ్రీ సరస్వతీ దేవికిని, శ్రీ వ్యాసభగవానునకును నమస్కరించి ఆ పిదప జయమును చెప్పుచున్నాను.

ఓమ్ హరే రామ హరే రామ రామ రామ హరే
హరే । హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ
హరే హరే ॥౧౦॥

ఓమ్ ఇతిషోడశకం నామ్నాం కలికల్మష నాశనమ్ ।
నాతః పరతరోపాయ స్సర్వవేదేషు దృశ్యతే ॥౧౧॥

తా॥ పదునాఱుఅక్షరములు గల మంత్రము కలికల్మషములను బోగొట్టునదై యున్నది. అట్లు కలికల్మషములను బోగొట్టునదైన మఱియేయుపాయమున్ను దీనికి మించినది సర్వవేదములందును కానుపించుటలేదు.

ఓమ్ హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ
కేవలమ్ । కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ
గతిరన్యథా ॥౧౨॥

తా॥ కేవలము శ్రీహరి నామముచే దప్ప ఈ కలియుగమున మనుజులకు తరించుటకు వేఱుమార్గము లేదు; ముమ్మాటికిని లేదు.

ఓమ్ శివనామైవ సంసారమహారోగైకశామకమ్ ।
నాన్యత్సంసార రోగస్య శామకం దృశ్యతే
మయా ॥౧౩॥

తా॥ శివనామ మొకటియే సంసారరోగమును శమింపజేయునదగును. అట్లు సంసార రోగమును శమింపజేయునట్టి మఱియొద్దియు నాచే గాంచబడలేదు.

ఓమ్ వృత్తిహీనం మనఃకృత్వా క్షేత్రజ్ఞం పరమా
త్మని । ఏకీకృత్య విముచ్యేత యోగోఽయం
ముఖ్య ఉచ్యతే ॥౧౪॥

తా॥ మనస్సును వృత్తిరహితముగాజేసి, క్షేత్రజ్ఞుని (జీవుని) పరమాత్మయందైక్య మొనర్చి, విముక్తి నొందవలయును. ఇదియే ముఖ్యమగుయోగమని వచింపబడును.

ఓమ్ యదా సర్వాణి భూతాని సమాధిస్థో న పశ్యతి ।
ఏకీభూత పరేణాసౌ తదా భవతి కేవలః ॥౧౫॥

తా॥ ఎపుడు సమాధిస్థితియందు సర్వజీవులను పరమాత్మ కంటె అన్యముగ భావించక కేవలము పరమాత్మ స్వరూపము గనే భావించుదురో అపుడే కేవలపరబ్రహ్మస్వరూపు లగుదురు.

ఓమ్ దేహాభిమానపాశేన చిరం బద్ధోఽపి పుత్రిక ! ।
బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ॥ .

తా॥ ఓ పుత్రికా ! దేహాభిమానము లను పాశముచే చిరకాలము నీవు బంధింపబడి యున్నావు. నేను చిద్రూపుడ నగు యాత్మను. వివేక ఖడ్గముచే పాశములను ఛేదించివైచి సుఖివి కమ్ము.

ఓమ్ సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి॥

తా॥ సర్వభూతములందు తన్నును, తనయందు సర్వభూతములను సమముగ భావించునట్టి ఆత్మ స్వారాజ్యమును (మోక్షమును) బడయుచున్నాఁడు.

ఓమ్ యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచమయి
పశ్యతి । తస్యాహం న ప్రణశ్యామి స చ
మేన ప్రణశ్యతి ॥౧౭॥

తా॥ అంతట నన్నే గాంచువాడును, నాయందే అంతయు వీక్షించువాడు నగు వానికి నేను కనబడకపోను; అతడు నాకు కనబడకపోడు.

ఓమ్ సర్వేఽత్ర సుఖినస్సన్తు । సర్వేసన్తు నిరా
మయాః । సర్వే భద్రాణి పశ్యన్తు । మా కశ్చి
ద్దుఃఖ మాప్నుయాత్ ॥౧౯॥

తా॥ ఈ ప్రపంచమున సందఱును సుఖమునే పొందుదురు
గాక! సర్వులును దుఃఖరహితు లగుదురుగాక! శుభములనే
గాంచుదురు గాక! ఒకడేని క్లేశముల నొందకుండును గాక!

ఓమ్ సర్వేషాం స్వస్తిర్భవతు । ఓం సర్వేషాం
శాన్తిర్భవతు । ఓం సర్వేషాం పూర్ణంభవతు ।
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః ॥

శంభో । శివ శివ । శివ శివ! శివ శివ! ।
నారాయణ! నారాయణ । నారాయణ । ఓమ్॥

హరిః ఓం.

---

# శ్రీ సూర్యాష్టకమ్

## సూర్యనమస్కారము

ఆదిదేవ నమస్తుభ్యం ప్రసీద మమభాస్కర
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తుతే 1
సప్తాశ్వారథమారూఢం ప్రచండం కశ్యపాత్మజం,
శ్వేతపద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ 2
లోహితం రథమారూఢం సర్వలోక పితామహం,
మహా పాపహరం దేవం తం సూర్యంప్రణమా మ్యహమ్.3
త్రైగుణ్యంచ మహాశూరం బ్రహ్మావిష్ణు మహేశ్వరమ్,
మహా పాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్.4
బృంహితం తేజసాం పుంజం వాయురాకాశ మేవ చ,
ప్రభుస్త్వం సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహం.
బంధూక పుష్పసంకాశం హారకుండల భూషితం,
ఏకచక్రధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్. 6
విశ్వేశం విశ్వకర్తారం మహాతేజ ప్రదీపనమ్,
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్. 7
శ్రీవిష్ణుం జగతాం నాథం జ్ఞానవిజ్ఞాన మోక్షదమ్,
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్.8
అంతర్జ్యోతిర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతి ర్పరాత్పరః,
జ్యోతిర్జ్యోతి స్స్వయంజ్యోతి రాత్మజ్యోతి శివోశ్మ్యహం. 9

తా॥ బాహ్యాభ్యంతరములు, ప్రకాశింపజేయు, జ్యోతిస్వరూపుడును, ప్రత్యగాత్మయు, పరాత్పరుడును, (సూర్యాది) జ్యోతులకున్ను జ్యోతియును, స్వయంజ్యోతియును, ఆత్మజ్యోతియును, అయిన శివుడు నేను.

ఆత్మజ్యోతిర్మనోజ్యోతి జ్యోతిశ్చక్షుస్స్వపశ్యతి,
సబాహ్యాభ్యంతర జ్యోతి స్సాజ్యోతి శివముచ్యతే. 10

తా॥ ఆత్మ జ్యోతి స్వరూపమే, మనస్సు జ్యోతిస్స్వరూపమే, సత్యస్వరూపుడైన పరమాత్మను దర్శించునవి. (జ్ఞాననేత్రము) ఇట్లు జ్ఞాననేత్రముగలవాడు బాహ్యాభ్యంతరములయందు ప్రకాశించు జ్యోతి స్వరూపుడగు శివుడే యగుచున్నాడు. ఆ జ్యోతియే. శివము.

---

## ఆ త్మా ర్ప ణ

### భ గ వ న్ని వే ద న.

ఓం భూర్భువ స్సువః । ఓం తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ।
ప్రచోదయాత్ ॥

దేవ సవితః ప్రసువ । సత్యం త్వర్తేన పరిషించామి॥
ఓం ప్రాణాయ స్వాహా । ఓం అపానాయ స్వాహా ।

ఓం వ్యానాయ స్వాహా । ఓం ఉదానాయ స్వాహా ।
ఓం సమానాయ స్వాహా । ఓం బ్రహ్మణే స్వాహా॥

తా॥ పంచప్రాణులతో గూడుకొనియున్న ఓం అను పరమాత్మస్వరూపు డయిన బ్రహ్మముకొఱకు అర్పితం స్వాహా॥

---

# మంగళమ్

శ్లో॥ మంగళం భగవాన్ శంభో మంగళం వృషభధ్వజః
మంగళం పార్వతీనాథ మంగళం భక్తవత్సలః॥
మంగళం భగవన్ విష్ణో మంగళం మధుసూదన ।
మంగళం పుండరీకాక్ష మంగళం గరుడధ్వజః॥
మంగళం మద్గురుభ్యోస్తు । తద్గురుభ్యోస్తు మంగళం
అస్మత్సర్వ గురుభ్యోస్తు । నిత్యశ్రీర్నిత్య మంగళం॥
మంగళం గురుదేవాయ । మహనీయ గుణాత్మనే ।
సర్వలోక శరణ్యాయ । సాధురూపాయ మంగళమ్ ॥

---

# శ్రీ విష్ణు హారతి

## ఆదితాళము.

జయ జగదీశ్వర ఈశ్వర – కరుణానిధే స్వామీ
జయ జయ సబ్ జగపాలక – ప్రభు అంతర్యామీ ॥జయ॥
శ్యామస్వరూప మనోహర – పీత వసన ధారీ
శశిమండల ముఖశోభా – మందహాసన ప్యారీ ॥జయ
శశిమకుట మకరాకృతీ – కుండలకానమే
మస్తక తిలక విరాజే – బనమాలా తనమే ॥జయ
చతురభుజా బాజుబంధ – కంకణ సుఖదాయీ
శంఖ చక్రి గదా పద్మ – బిరాజేకర మాహీ ॥జయ
కటీమే మణిమయ సుందర—మేఖల రాజ రహీ
చరణనమే నూపురధ్వని—చనచన బాజ రహీ ॥జయ
వామ అంకమే కమలా—ముఖ పంకజ సోహే
పీరఖయగళ చ భీ సుందర—ఋషిముని మన మోహే
స్వర్ణసింహాసన విస్తర—కోమల సుఖకారీ
శేషనాగ ఫణ ఛత్ర—విరాజే శిరభారీ ॥జయ
గరుడ ఖడే తరజోడే—పార్షదచమరకరే
శివ సనకాదిక నారద—శారద ధ్యానధరే ॥జయ
దీనదయాళ దయానిధే—భక్తజన హితకారీ
శరణాగత ప్రతిపాలక—భవబంధనహారీ ॥జయ

జో జన హరికీ ఆరతీ — ప్రేమసహిత గావే
బ్రహ్మానంద పరమపద — సో నిశ్చయ పావే
జయ జగదీశ్వర ఈశ్వర—కరుణానిధే స్వామీ
జయజయ సబ్ జగపాలక— ప్రభు అంతర్యామీ॥

# మంగళము

## ఆటతాళం

1. పరాత్పరా పరేశ । పరంధామ మంగళం
సురేంద్ర మౌనివందితా । సుఖాత్మ మంగళం ॥పరా॥
2. అనాధనాథ రక్షకా । అనంత మంగళం
సనాతనా వినోదనా । సుధీర మంగళం ॥పరా॥
3. అఖండ చిత్కళావిలాస। యనఘ మంగళం
అఘోర పాపనాశ జగ ।ద్భరిత మంగళం ॥పరా॥
4. అశేష దుఃఖరహిత । ఆదిదేవ మంగళం
విశేష గ్రహావినాశ । విశ్వేశ మంగళం ॥పరా॥
5. భక్తాంతరంగవాస । పరమపురుష మంగళం
సర్వశక్తి నిలయవాస । విశ్వరూప నీకు మంగళం ॥ప॥
6. ధరణి గీత ఆశ్రమా । సుధామ నీకు మంగళం
దాస హృదయవాస । చిద్విలాస యిదిగో మంగళం ॥
పరాత్పరా ! పరేశ ! పరంధామ మంగళమ్॥

# నమస్కారము

శ్లో॥ నమస్తే నమస్తే విభో విశ్వమూర్తే,
నమస్తే నమస్తే చిదానందమూర్తే,
నమస్తే నమస్తే తపోయోగ గమ్య,
నమస్తే నమస్తే శ్రుతిజ్ఞానగమ్య.

శ్లో॥ త్వమేవ మాతా చ పితాత్వమేవ,
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ,
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ,
త్వమేవ సర్వం మమదేవ దేవ.

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా,
బుధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్,
కరోమి యద్యేత్ సకలం పరస్మై,
నారాయణాయేతి సమర్పయామి.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం,
న్యాయేన మార్గేణ మహీం మహీశాః,
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం,
లోకాః సమస్తాః సుఖినో భవంతు.

ఓం సర్వేషాం స్వస్థిర్భవతు,
ఓం సర్వేషాం శాంతిర్భవతు,
ఓం సర్వేశాం పూర్ణం బవతు.

ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః.

ఓం అని దీర్ఘముగా ఒక నిమిష కాలము మూలాధారమునుంచి శ్వాసముయొక్క సహాయముచేత మెల్లగ ఉచ్చరించుచు సహస్త్రారమునందు లయింపజేయవలయును. ఇట్లు ఓం ఓం ఓం అని మూడుసార్లు ధ్యానించి శాంతి నొందుదురుగాత,

---

## భజన.

శ్రీకృష్ణ చైతన్య ప్రభు నిత్యానందం
హరేరాం హరేకృష్ణ రాధే గోవిందం
హేరామ హేకృష్ణ హే వాసుదేవ
హరేరాం హరేకృష్ణ రాధే గోవింద
హేరామ హేకృష్ణ హేజగద్గురో
హరేరాం హరే కృష్ణ రాధేగోవింద
గోవింద గోవింద హరే మురారే
గోవింద గోవింద ముకుంద కృష్ణ

కృష్ణా కృష్ణా గోవిందకృష్ణా
గోవింద గోవింద గోపాలకృష్ణ
కృపానంద ముకుంద మురారే
వామన మాధవ గోవింద
శ్రీధర కేశవ రాఘవ విష్ణో
లక్ష్మీనాయక నరసింహో.

## శ్రీ శివస్తుతి—నామావళి

చంద్రశేఖర చంద్రశేఖర । చంద్రశేఖర పాహిమాం
చంద్రశేఖర చంద్రశేఖర । చంద్రశేఖర రక్షమాం॥ 1
సంగమేశ్వర సంగమేశ్వర । సంగమేశ్వర రక్షమాం
పాపనాశన పాపనాశన । పాపనాశన పాహిమాం॥ 2
శంభో శంకర గౌరీశా । శాంతదయాపర విశ్వేశా
ఉపదిశతారక మద్యైవ। కాలవిశంభో నహిదేవా. 3
శంకరశివ శంకరశివ । శంభోశంకర మహాదేవ
శంభోశంకర మహాదేవ । సాంబసదాశివ గురుదేవ॥ 4
శివశివ శివశివ శివశరణం।భవభయ భవభయభయహారణం ॥5
శంకరశంకర జగత్ప్రభో।సంయమిశంకర జగద్గురో॥ 6
దత్తగురు దత్తగురు । దత్తాత్రేయ వధూతగురు॥ 7॥
శివ శివ శివ శివ । శివాయ నమ ఓం,
శివాయ నమ ఓం । శివాయ నమ ఓం నమశ్శివాయ ॥8

# ప్రార్థన

1. జయ జానకీరమణ । జయ విభీషణ శరణ
జయ సరోరుహచరణ । జయదీన కరుణా ॥జయ॥
జయ లోక శారణ్య । జయ భక్త కారుణ్య
జయ దివ్య లావణ్య । జయ జగత్పుణ్యా ॥జయ॥

2. సకలలోకావాస । సాకేతపురివాస
అకళంక నిజదాస । అబ్జముఖిహాసా ॥జయ॥
సుఖమునిస్తుతిపాత్ర । శుభదనుత చారిత్ర
మకర కుండలకర్ణ । మేఘశ్యామవర్ణా ॥జయ॥

3. కమనీయకోటీర । కౌస్తుభాలంకార
కమలాక్ష రఘువీర । కమలావిహారా ॥జయ॥
సమరరిపు జయధీర । సకలగుణ గంభీర
అమల హృత్సంచార । అఖిలార్థిహారా ॥జయ॥

4. రూపనిందితమార । రుచిరసద్గుణశూర
భూప దశరథ కుమార । భూభారహార
పాపసంఘవిదార । పంక్తిముఖ సంహార
శ్రీపతే సుకుమార । సీతావిహార ॥జయ॥

ఆరభిరాగం — త్రిపుటితాళం.

శరణు శరణు సురేంద్ర సన్నుత । శరణు శ్రీపతివల్లభా
శరణురాక్షస గర్వసంహార । శరణు వెంకట నాయక ॥శ॥
అనిమిషేంద్రులు మునులు । దిక్పతు లమర కిన్నరసిద్ధులు,
ఘనతతో రంభాదికాంతలు । గాచినా రెచ్చరికయా ॥శర॥
కమలధరుడును కమలమిత్రుడు । కమలశత్రుడు కమలయు
క్రమముతో మిముగొలువనిప్పుడు।గాచినారెచ్చరికయా ॥శ॥
పరమపద గోవింద మాధవ । పద్మనాభ జనార్దనా
ధరణి ధరవర గరుడవాహన । దైత్య బలిమదభంజనా ॥
ఎన్నగల ప్రహ్లాదభక్తులు । ఎలమితో మిము గొలువ వచ్చిరి
విన్నపము వినవయ్య దేవర । విజయ వెంకట నాయకా॥శ॥

మధ్యమావతిరాగం — ఆదితాళం.

ప॥ నారాయణతే నమోనమో భవ।నారదసన్నుత నమోనమో॥
మురహర నగధర ముకుందమాధవ । గరుడ గమన పంకజనాభా ।
పరమపురుష భవభంజన కేశవ । నరమృగ శరీర నమో నమో ॥నా॥
జలధిశయన రవి చంద్ర విలోచన । జలరుహాభవనుత చరణయుగ ।
బలిబంధన గోపీజనవల్లభ । నళినోద్ధరతే నమోనమో॥
శ్రీవత్సలాంఛన పీతాంబరధర।దేవకినందన నారాయణా
గోవత్సపాలన గోవర్ధనధర।గోపాప్రియతే నమోనమో॥

కౌసల్యాత్మజ కాయిత ఫలదా। కరుణాసాగర కాంతిమయా
దశరథనందన దనుజకులాంతక । కుశలవ జనకా !
నమో నమో ॥

తారాపతిహార తపనకులోద్భవ। తాపసమునిగణవంద్య పదా
మారీచాంతక మారుతిసేవిత । వారధిబంధన నమో నమో॥

ఆదిదేవ సకలాగమపూజిత । యాదవకుల మోహనరూపా
వేదోద్ధర శ్రీ వెంకటనాయక। నాధా ప్రియతే నమోనమో॥

సావేరిరాగం — చాపుతాళం.

1. దేవేశ గణారాధిత । దివ్యాంబుజపాదా
శ్రీ వెంకట గిరినాయక । శ్రీశా హెచ్చరికా ॥దే॥
2. కలిమానుష కలుషాపహా । కమనీయ సుకీర్తే
అలిమేలో మంగా మోహన । మూర్తే హెచ్చరికా॥దే॥
3. జలజాసన పరిపాలన । జగదేకనిధానా
కలశాంబుధి తట శోభన । చరణా హెచ్చరికా ॥దే॥
4. వకుళాసన హరిచందన । వనమధ్యవిహారా
సకలాగమపరిపాలన । చతురా హెచ్చరికా ॥దే॥
5. నారాయణ నరపోషణ । నరకాది సంహరణా
హేరావణ మద భంజన । ధీరా హెచ్చరికా ॥దే॥
6. శ్రీ కేశవ నారాయణ । గోవింద మురారే
శ్రీ మాధవ మధుసూదన । దామోదర శౌరే ॥దే॥

7. శేషాచల నిలయావర । భూషామణి వలయా
రోషాదివిజయమౌని । విధేయా హెచ్చరికా ॥దే॥
8. రజనీ చరవర నాయక । కాలావనమాలా
వ్రజపాలన వరవీజయ ।గోపాల హెచ్చరికా ॥దే॥

భజన ఆట.

1. కృష్ణ, గోవింద, గోపాల గాతే చలో,
మనకే, విషయోంకే, విషసే, హటాతే చలో,
నామధనకా, ఖజాన, బడాతే చలో, ॥కృష్ణ॥
2. దేఖ, నా, ఇంద్రయోంకే, న, ఘోదేభగే,
రాత్‌దీన, ఉనకే, సంయమకే, కోడెలగే,
అపనే, రథకే, సుమారగ, చలాతే చలో ॥కృష్ణ॥
3. కామ కరతే రహో, నామ జపతే రహో
రాత, దీన, కృష్ణకా, ధ్యాన, ధరతే రహో
పాపకి, వాసనయోం, హటాతే చలో ॥కృష్ణ॥
4. యాద, ఆయేగి, ఉనకె, కభీ న, కభీ
ఏసా, విశ్వాస, మనమే, జమాతే చలో ॥కృష్ణ॥
5. దుఃఖమే, తడపో మత్, సుఖమే, ఘూలో మత్,
ప్రాణ, జాయే, మగర్, నామ భూలో మత్
రాధా, కృష్ణకే, మనమే, రిజాతే చలో ॥కృష్ణ॥
6. నామ, జప, జపకే, లోగేనే, పాయిగలీ,
భక్తనే, హై, యూసీసే, కరీవనత్,
మురళీ, వాలోకె, మనసీ, రిజాతే చలో ॥కృష్ణ॥

భ జ న - ఆ ట .

1. మనువా, గోవింద, గోపాల గాతే చలో,
అపనే ము_క్తికా । మారగ బనాతే చలో ॥మ॥

2. దుఃఖమే, రోవోమత్ । సుఖమే, భూలో మత్,
ప్రేమ, భ_క్తికే హం సూ । బహాతే చలో ॥మ॥

3. లోగేనె, కహతేకీ । భగవాను, ఆతే నహీ
ప్రేమ, భ_క్తిసే, ఉనకో । బులాతే, నహీ
భ_క్త ప్రహ్లాద, కీరీట । లాగాతే చలో ॥మ॥

4. లోగో కహతేకీ । భగవాను, ఆతే నహీ,
శవరీకి, తరహా, తుమ । ఖిలాతే, నహీ
సాగ, భ_క్త విదురకే తరహా । ఖిలాతే చలో,

5. దుఃఖమే, కహతేహై । కీ, భగవాను ఆతే నహీ
ద్రౌపతీ, కీ, తరహా । తుమ బులాతే నహీ
అఖిల జగకే, ప్రభుసే । మన లాగాతే చలో ॥మ॥

6. మనువా, గోవింద । గోపాల, గాతే చలో
ఏసా విశ్వాస మనమే । జమాతే, చలో
మనువా, గోవింద । గోపాల, గాతే చలో ॥మ॥

# శివస్తోత్రమ్

బ్రహ్మమురారి సురార్చిత లింగమ్
నిర్మలభాసిత శోభితలింగమ్
జన్మజ దుఃఖ వినాశక లింగమ్
తత్ప్రణమామి సదా శివలింగమ్॥

దేవముని ప్రవరార్చితలింగమ్
కామదహన కరుణాకరలింగమ్
రావణదర్ప వినాశనలింగమ్
తత్ప్రణమామి సదా శివలింగమ్॥

సర్వసుగన్ధ సులేపితలింగమ్
బుద్ధివివర్ధన కారణలింగమ్
సిద్ధసురాసుర వందితలింగమ్
తత్ప్రణమామి సదా శివలింగమ్॥

కనక మహామణిభూషితలింగమ్
ఫణిపతివేష్టిత శోభితలింగమ్
దక్షసుయజ్ఞ వినాశనలింగమ్
తత్ప్రణమామి సదాశివలింగమ్॥

కుంకుమ చందనలేపితలింగమ్
పంకజహార సుశోభితలింగమ్
సంచిత పాపవినాశన లింగమ్
తత్ప్రణమామి సదాశివ లింగమ్॥

# శ్రీ రామ ధ్యానము ✓

## ఏకతాళం

భజే విశేషసుందరం । సమస్తపాప ఖండనం
స్వభక్త చిత్తరంజనం తదైవరామ మద్వయమ్॥
జటాకలాప శోభితం । సమస్తపాప నాశకం
స్వభక్తభీతి భంజనం । భజేహరామ మద్వయమ్॥
నిజస్వరూప బోధకం । కృపాకరం భవాపహామ్
సమం శివం నిరంజనం। భజేహరామ మద్వయమ్॥
సప్రపంచ కల్పితం హ్యనామ । రూపవాస్తవమ్
నిరాకృతిం నిరామయం। భజేహరామ మద్వయమ్॥
నిష్ప్రపంచ నిర్వికల్ప । నిర్మలం నిరామయమ్
చిదేకరూప సంతతం । భజేహరామ మద్వయమ్॥
భవాబ్ధిపోత రూపకం । హ్యశేషదేహ కల్పితం
గుణాకరం కృపాకరం। భజేహరామ మద్వయమ్॥
మహావాక్య బోధకైర్విరాజ । మానవాక్పదైః
పరబ్రహ్మ వ్యాపకం । భజేహ రామ మద్వయమ్॥
శివప్రదం సుఖప్రదం । భవచ్ఛిదం భ్రమాపహామ్
విరాజమాన దైశికం । భజేహరామ మద్వయమ్॥

## కానడరాగము - ఆదితాళం.

హరేరామ హరేరామ । రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ । కృష్ణ కృష్ణ హరేహరే ॥హ॥

జననమొందె తనయుడొకడు । ఘనుడు రూపవంతు డెలిమి
జనకు డుల్లసిల్ల నెల్ల । జగములెల్ల నందమొందె హ॥
కరుణజూచి ఏలుకోర।పరమపురుష పాపదూర
నిరతమూని నామస్మరణ। మరువకా ధ్యానించితీర ॥హ॥
ఘోర సంసారాబ్ధిదాటు । దారిదెరుగ జాలనయ్య
నేరమూలు నెల్లమరచి । దారిజూపు దేవదేవ హ॥
అండపిండ బ్రహ్మాండంబులెల్ల । నిండిన బ్రహ్మాండరూప
దండిప్రేమ జూపి నీదు । అండజేర్చుకోర ధీర హ॥
అందమౌ నీ శ్యామసుంద । రాంగదర్శనం బొసంగి
నందహృదయ నందబ్రహ్మ । నందవార్ధి దేల్చుమయ్య॥
ధరణిగీత ఆశ్రమాసుధామ।పరమపురుష సద్గురురామనామ
తిమ్మదాసహృదయవాస। నిరత చిద్విలాస యీశ హ॥

## హిందుస్థాని భైరవి – చాపుతాళం

1. నేడు మనమందరముగూడి । పాడుదము పరమేశుని ।
యీడుజగమున లేకయుంతట। హెచ్చివెల్గెడు జ్యోతిని॥
2. కంధరమ్ముల, మందిరమ్ముల । గహనపర్వతసీమల ।
సుందరధ్వనితోడియోగులు । స్తుతియొనర్చెడు దేవుని॥
3. చెట్టుచెట్టున గానసంబున । జెలగు మధురతరంబుల ।
పిట్ట లెవనిని బాడుచుండునొ। ప్రీతిసాగరు నాతని ॥నే॥
4. నూతులందును చెరువులందును।లోతు తెలియని జలధిలో
శీతజలమును దాగివి కీర్తన । జేయు జలచర మాతని ॥

5. ఉత్సవంబుల నుల్లమలరగ । నువిదలెవ్వని బాడుచు
నుత్సహింతురో, యా దయామయు । నుత్తమోత్తమ
పురుషుని ॥నేడు॥

6. శూరులను వీరాధివీరులు । శుద్ధహృదయాంబుజముల
సారెసారెకు నెవనిదలతురో । సత్స్వరూపు బరేశుని ॥

బేహాగ్ - ఆదితాళం.

1. పరపితా మా । ప్రార్థన వినరా ।
పాపములో బడనీయకురా ।
శరణాగత ర । క్షకుడని నిన్నే ।
శరణుజొచ్చితిమి విడవకురా ॥పర॥

2. పరులను మావలె భావించెడు మది
పరమాత్మా మా కొసగుమురా ।
నిరతమునంతట నీమహిమల గను ।
నిరుపమవిద్యను నేర్పుమురా ॥పర॥

3. నీయాజ్ఞలనే నెరవేర్పగ మది ।
నిర్మలభక్తిని నిలుపుమురా ।
న్యాయసత్య కరుణాలయ మాలో ।
నద్భుతనాట్యము సల్పుమురా ॥పర॥

4. శాంతిధామ మా స్వాస్తమునందలి ।
చింతల నీ వెగ జిమ్ముమురా ।
అంతరంగమును నరవిందము నీ ।
కెంతయు బ్రీతి న । ర్పింతుమురా ॥పర॥

శహానా - చాపుతాళం.

1. ప్రభుని మరచితివేలే । పాపపు ఓ మనసా ।
శుభదృష్టితో నిన్ను । జూచునుగదవే ఓ మనసా ॥ప్ర॥

2. విభుదయ లేకున్న । విశ్వములోన
విభవము లెవ్వైన । విలసిల్లగలవే ఓ మనసా ॥ప్ర॥

3. నీవు పుట్టకమున్నే । నీకై దయతో
గావలసిన వెల్ల । గల్పించెగదవే ఓ మనసా ॥ప్ర॥

4. శరణని యా ప్రభు । మరుగున జేర
దరిలేని దుఃఖాబ్ధి । దాటించుగదవే ఓ మనసా ॥ప్ర॥

5. తలపులోపలనుండి । ధర్మమె జూపి
పలుతెరగుల నిన్ను । పాలించుగదవే ఓ మనసా ॥ప్ర॥

6. కరుణాది సద్గుణ । ఘనమణి ఖనియై
పరిపరివిధముల । భాసిల్లుగదవే ఓ మనసా ॥ప్ర॥

ముఖారి — ఆదితాళం.

1. నిఖిలజగము లేలు నీశు । నిన్ను నేలకుండునా ।
నిఖిలమెరుగు సర్వసాక్షి । నిన్ను నెరుగకుండునా ?॥ని॥

2. నిఖిల జీవరక్షకుండు । నిన్ను గానకుండునా ।
నిఖిల భువననాయకుండు । నిన్ను నడుపకుండునా?॥ని

3\. నిఖిల మతని కప్పగింప । నిన్ను మెచ్చకుండునా
నిఖిల మతని దయయే యనగ। నీకు దుఃఖముండునా?

4\. నిండి యంతట నుండువాడు । నీలో నుండకుండునా ?
నిండు మదిని నతని గొల్వ । నీకు లోప ముండునా ?

మధ్యమావతి – ఆదితాళం.

1\. మరి రాదుర యీ । మానుష జన్మము
పరమపురుష కృప । వలననె గలిగెను ॥మరి॥

2\. పరమేశుని వౌ । పరమాద్భుతముల
దరిశన మొనరింప । దగు యత్రిం బిది ॥మరి॥

3\. పరిపరి విధముల । బరులకు హితముల
దరిని జేయ సా । ధన రాజమ్మిది ॥మరి॥

4\. ఘన సద్గుణమణి । గణము గడింపగ
మనకు లభించిన । మహిత ధనం బిది ॥మరి॥

5\. దేవుని జేర్పగ । జీవుని గొని చను
దేవదత్తమౌ । దివ్యరథం బిది ॥మరి॥

జంఝూటి — ఆదితాళము.

వదలకు మార్గము । పరమార్గమ్మున
వర్తిలుచుండవె । యో మనసా ।

సదమల భక్తిని । స్వామిని గొలుచుచు
సౌఖ్యము లందవె । యో మనసా ॥౧॥

పరుల సుఖమునే । పాటించుచు భువి
పను లొసరింపవె । యో మనసా ।
దురితదవాగ్నిని । దూరుదు దారుణ
దుఃఖము లందకె । యో మనసా ॥౨॥

సత్యమె సర్వ । శ్రేయస్కరమని
సతత మెరుంగవె యో మనసా ।
సత్యవ్రతమును । సలిపెడు నపుడే
శౌర్యము జూపవె । యోమనసా ॥౩॥

న్యాయమె స్వర్గ । ప్రాయము జగతిని
నమ్మము దృఢముగ । నో మనసా ।
న్యాయము దప్పిన । నరకంబుగ భువి
నాడే మారునె । యో మనసా ॥౪॥

సుగుణరత్నముల । సొగసుగ దాల్చి
శోభిలుచుండవె । యో మనసా ।
అగణిత గుణ ర । త్నాకరు డగు పర
మాత్మయె శరణము । విను మనసా ॥౫॥

ఆ ది తా ళ ం.

ప॥ పూరణ (ప్రేమలగా । దిలమే
జబనేమక బంధన చూటగయా । ॥పూ॥

1. కోయీ పండితలోక బతావత హై ।
సమజావత హై జగరీత నకో ।
జబ పీ్రతమసే దృఢపీ్రత భయీ ।
సబ రీ తనకా బంధన టూట గయా. ॥పూ॥

2. కోయీ తీరథపర్యన జావత హై ।
కోయీ మందిరమే నిత దర్శనకో ।
ఘటభీతర దేవ దేదార హుయా ।
తబ బాహిరసే మనరూట గయా. ॥పూ॥

3. కోయీ జీవ కహే కోయీ ఈశ కహే ।
కోయీ గావత (బ్రహ్మ నిరంజనకో ॥
జబ అందర బాహిర ఏక హుయా ।
సబద్వైతక పడదా ఫూటగయా. ॥పూ॥

4 సోయీ ఏక అనేక స్వరూప బనా ।
పరిపూరణహై జలమేథలమే ॥
బ్రిహ్మానందకరీ గురు దేవదయా ।
భవసాగరకా భయ ఫూటగయా. ॥పూ॥

# శ్రీ గురు ప్రార్థన

ఆ ది తా ళ ం.

జయ గురుదేవ దయానిధి దీనన హితకారీ,
జయజయ మోహవినాశక భవబంధనహారీ ॥జయ॥
బ్రహ్మ విష్ణు సదాశివ గురుమూరతిధారీ,
వేదపురాణ బఖావత గురుమహిమాభారీ ॥జయ॥
జపతప తీరథసంయమ దాన వివిధదీనే,
గురుబీన జ్ఞాన నహోవే కోటి జతనకీనే ॥జయ॥
మాయా మోహ నదీజల జీవబహేంసారే,
నామ జహాజ భీతాకర గురుపలమే తారే ॥జయ॥
కామక్రోధ మదమత్సర చోర బడే భారే,
జ్ఞాన ఖడగదే కరమే గురుసబ సంహారే ॥జయ॥
నానాపంథ జగతమే నిజ నిజగుణ గావే,
సబకా సారబతాకర గురుమారగ లావే ॥జయ॥
గురు చరణామృత నిర్మల సబపాతకహారీ,
బచన సునత తమనాసే సబసంశయటారీ ॥జయ॥
తన మన ధనసబ అర్పణ గురుచరణకీజే,
బ్రహ్మానంద పరమపద మోక్షగతీలీజే ॥జయ॥

రాగం - ఆదితాళం.

హరినారాయణ గోవిందా యను । అచ్యుతనామ మితాయి,
హరి హర బ్రహ్మాద్యమరాదులకును । గోచరమయిన
మితాయి ॥హ॥ 1

ఎంత భుజించిన రోయదుమనుసకు। పరమాత్మనిమితాయి,
ఇది చాలునని చెప్పుటకు నాలుక । విరుగదు రుచిగల రామ
మితాయి ॥హ॥ 2

కోటి ధనంబులు ఇచ్చిన దొరుకదు । కోసలదేశ మితాయి,
సాటిలేని సద్భక్తి జ్ఞానులకు। సేవించినదే మితాయి ॥హ॥3
పావనులగు శుక శౌనకాదులకు । ప్రియలంబైన మితాయి,
భువిలోగల యాపదలన్నియు। పారదోలు మితాయి ॥హ॥
శ్రవణమనన నిధి ధ్యాసులయందును।జేరిన రామ మితాయి,
యెన్ని యాపదలు యున్నను గాని । హరి నెన్నువారిది
మితాయి ॥హ॥ 5

పరమాద్భుత వర నాదబ్రహ్మ । నందార్చిత మితాయి,
ధరామరులు భువి వినుతిసేయు । సుందరంబైన మితాయి॥
వేదవాక్యమను గోధుమపిండితో। వెలయగసేయు మితాయి,
సాధన చతుష్టయ సంపత్తియుగల।సాధులకిచ్చిన మితాయి॥
కొంటెలకును దుర్మార్గజనులకు । కొనరానిది మితాయి,
అంటి అంటక అరింటావల।అనుభవమైన మితాయి॥హ॥ 8
కారణవరగురు కటాక్షమున । తన కన్నులవెల్గు మితాయి,
ధర గుడియాత పురమున । స్థిరముగ నిలచిన నిర్మలమైన
మితాయి ॥హ॥ 9

అభంగ — ఏకతాళం.

1. ఘడి ఘడి ఘడి చరణతుఝె । హాతరీతో రాము
ఆసనిశయనిభో జనగమని । చందతుజ అంహా ॥ఘ॥
2. దృష్టాతీత పూర్ణబ్రహ్మ । నిత్య నిర్వికారా
అంబుజదళా నయన మునీ । మానసీ విహార ॥ఘ॥
3. సర్వసాక్షి సర్వోత్తము । సర్వ గురురూపా
ప్రేమయాచె సౌఖ్యసింధు । దశరథ కులదీప ॥ఘ॥
4. తాతమాత భ్రాతబంధు । తుజ ఏక పాహీ
కేశవహ్మణే కరీదయా । శరణ తుజపాయీ ॥ఘ॥

## గీతా కీర్తన

రాగం - బంగల - ఆదితాళం.

ప అర్జునకే రణభూమి విషే హోరీ ।
బ్రహ్మజ్ఞాన నిర్మల సమఝావే ॥అ॥
తుం కిసికాహై కౌన తుమారా ।
ఏకహి ఆవత ఏకహి జావే ॥అ॥
అవినాశీయహ జీవ సనాతన,
దేహాకే సంగ మరణ నహి పావే ॥అ॥
ఘట ఘట భీతర వ్యాపక హుంమై ।
భేదభావనా కేం మనలావే ॥అ॥
బ్రహ్మనంద స్వరూపహై తేరా ।
శోకకీ బాతన కేం బిసరావే ॥అ॥

# బ్రహ్మానంద భజన కీర్తనలు

రాగం అసావేరి - తాళం, రూపం

ప్రి॥ ప్రిభు తేరీ మహిమా కిసవిధగావూం ।
తేరే అంత కహీ నహీ పావూం ॥

అ॥ అలక్ నిరంజన రూపతుమారే, కిసవిధ ధ్యానలగావూం,
వేదపార అజహుం నహీపాయే మైకై సే బతలావూం॥
గంగా యమునా నీరబహాయే । మజ్జనకిమకరవావూం,
వృక్షబగీచే రచనాతేరే । కైసే పుష్పచడావూం ॥ప్రి॥
పంచభూతకే దేహన తుమరీ ।చందనకిమలి పటావూం,
సకలజగతకే పాలనకర్తా। కిసవిధభోగ లగావూం ॥ప్ర॥
హాత జోడకర అరజకరుంమై । బారబారసిరనావూం,
బ్రహ్మానంద మితాదే పడదా।ఘరఘర దర్శనపావూం॥ప్ర॥

భ జ న కీ ర్త న

1. సునో, ఆజ జగదీశ, వినతి హమారీ ।
పడా, హుం శరణ బీచ, ఆకర తుమారీ ॥దేఖ॥
2. మాతా తుం హై, పితా తుం హమారా ।
విధాత, జగతక, తుంహై, విశ్వకారీ ॥
3. విషయోంకీ, లాలచమే, తుజకో విసారా ।
క్షమాకరో, ప్రిభు మేరే, అవగుణ హజారీ ॥
4. సంసార సాగరమే, గహార ఫసాయ ।
ముజే అబ దయాకరకే, లీజే ఉబారీ॥
5. తేరేబినా, అవురు పాలక, నమేరీ ।
బ్రిహ్మానంద పూరణ కరో, ఆశామేరీ ॥

భజన కీర్తన.

1. ప్రిభు తేరి, మహిమా, కౌన బఖానే ।
   జాకే బ్రిహ్మాదీక, నహి జానే॥
2. తుం సర్వజ్ఞ చరాచర పూరణ వ్యాపక సభీ టికానే ।
   ఘట ఘట భీతర జ్యోతి తుమారీ, ఢుండత డూర దివానే॥
3. కైసే దేహ రచీహై తుమనే, కిసవిధ ప్రాణచలానే ।
   జీవకహాంసే, ఆవేజావే కోయి సభేనాపిచానే ॥
4 సూరజ, చాంద, శితారే, పర్వత నదియోం, నీరబహానే।
   భువన చతుర దశ, రచనాతేరీ తుజమే, సకలసమానే॥
5. తేరీ శరణ పడే జో, ప్రాణి మోక్షధామ పోహుంచానే।
   బ్రిహ్మానంద, బినా, తుజ సుమరణ జన్మజన్మ బటకానే॥

భజన కీర్తన.

1. రే, మనువా, కేం జగమే లిఫటాయో ।
   తేరీ కోయీ, నహిహై, సహాయో॥
2. యహ సంసార, స్వపనకి మాయా, విరయా, బరమ
   భులాయో।
   క్షణభంగర సబ వస్తువినాశి ప్రీతిలగా పచతయో ॥
3. విషయామృగ తృష్ణా పాణి, దేఖదేఖి రరుఘాయో।
   కబహుం, ప్యాసమిటే నహితేరీ జనమజనమభటకాయో॥
4. జోప్రిభునిత్య సహాయకతేరీ తిసకో, కెం బిసనాయే ।
   సకలవ్యాపక అంతరయామి, జనసబుజగఉపజాయో ॥
5. తేరీ మేరీ కరతే నిశదిన సబహీ జన్మభితాయో ।
   బ్రహ్మానంద ధ్యానకరో ప్రభుకా జోచాహే సుఖపాయో॥

రాగం, ధ్రుప - ఆదితాళం.

ప॥ జో జన ధ్యానధరే నిర్గుణకో,
సో ఈశ్వరకా దరశన పావే ॥జో॥

అ॥ జాయ ఏకాంత భవనమే భైఠే।
కోమల ఆసన భూమి బిచావే,
చింతా పికర చోడ సబమనకో।
త్రికూట మహాలమే సూరతి జమావే॥

పహాలే పహాసే రవి శశి తారే।
ఫల ఫల మే బిజలీ చమకావే,
దూర దూరకే దివ్య దేవగణ।
పున పున తేజ బీచ దరశావే ॥జో॥

దినదిన ధ్యానధరే యోగీజన।
బ్రిహ్మ జోత ఘఠమే ప్రిగటావే,
కోటిభానుసమ జిలమిల జిలమిల।
రోమ రోమమే సుఖవుపజావే॥

కర్మనకే బంధన సబ టూటేమాయ।
మోహజాల కటజావే,
బ్రిహ్మానంద మోక్షపదపావే।
గర్భవాస పిరతే నహీ ఆవే ॥జో॥

రాగం, అసావేరి - రూపకము.

ప॥ ప్రభు ఇక నామతేరా సుఖకారీ ।
సబ దునియాం పరము దుఃఖారీ ॥

అ॥ గర్భవాసమే పులటే రసనే ।
సౌ దశ మాస గుజారీ,
బాహిర ఆయా పడ పృథివీపర ।
మాయలీ పటి తుమారీ ॥ప్ర॥

బాలపణేమే, పరాధీన నిత ।
మాతాగోధ ఖిలారీ,
సుఖదుఃఖ సబహీ వ్యాపతతనమె ।
బచన సకెన వుచారీ ॥ప్ర॥

జో బనమే నీత కామ సతావే ।
మోహాలీయే మననారీ,
బాల బచ్చోంకే పాలనకే హిత ।
పరఘరదాస భిఖారీ ॥ప్ర॥

వృద్ధపణేమే రోగలగే సబ ।
కాయనిర్బలహారీ,
బ్రిహ్మానందా భజనబినతుమరే ।
జన్మమరణ భయభారీ ॥ప్ర॥

# శ్రీ శివహారతి

ఆదితాళం.

జయ శివ శివ శివ శంకరం జయ గిరిజాధీశా
జయ జయ కరుణాసాగర పశుపతి జగదీశా ॥జయ॥
జూటజటా శిర ఊపర సురసరి ధారచలే
చంద్రికళా మస్తకమే ముండనహార గలే ॥జయ॥
ఫాలవిలోచన సుందర కుండల కాననమే
భూషణ నాగవిరాజిత భాగాంబర తనమే ॥జయ॥
అంగవిభూతి మనోహర గౌరశరీర లసే
కరత్రిశూల పరసు వర గిరిజాసంగ భసే ॥జయ॥
గిరికైలాస శిఖర శుభసింహాసన రాజే
నందీగణ గణనాయక శోభిత దరవాజే ॥జయ॥
ఋషి ముని సురగణ మిలకర మహిమా గానకరే
యోగీజన హిరదోమే నిశదిన ధ్యానధరే ॥జయ॥
సకల మనోరథనాయక దీనన దుఃఖహర్తా
జన్మమరణ భవబంధన హారణ సుఖకర్తా ॥జయ॥
పూరణ బ్రహ్మ నిరంజన నిర్గుణ గుణరాశీ
సకలజగతి ప్రతిపాలన కారణ అవినాశీ ॥జయ॥
జో జన శివకీహారతి గాయన నిత్యకరే
బ్రహ్మానంద సహజమే సో భవసింధుతరే ॥జయ॥
జయ శివ శివ శివ శంకర జయ గిరిజాధీశా
జయ జయ కరుణాసాగర పశుపతి జగదీశా ॥జయ॥

# కీర్తన

ప॥ సాధుసభా సద్గురు స్వామి సభా ।
భజనపరులకు భాసిల్లు సభా॥

అ॥ ఉత్తమభక్తుల మూర్తిసభా ।
సజ్జనులకు సంతోష సభా ॥

1. భక్తులకును పరోక్షసభా ।
జ్ఞానులకును అపరోక్ష సభా ॥

2. కరుణారస ముప్పొంగు సభా ।
సోదరబృందము నిండు సభా ॥

3. ఋషిధర్మములను నిల్పు సభా ।
మళయాళస్వాముల మహిమ సభా ॥

4. జ్ఞానభాస్కరుడు వెల్గు సభా ।
సర్వప్రాణులకు తృప్తి సభా ॥

5. ప్రకృతి కళల వంచించె సభా ।
బ్రహ్మానందమయము సభా ॥

6. సత్య శాంతము దయ జూపు సభా ॥
నిత్యసుఖమను మోక్షము నిచ్చు సభా ॥

అభంగ - ఆదితాళం.

1. టాదేవిటపర నికట కటపరకర । పీతాంబరధారీరే,
శంఖచక్రి దోహాతబిరాజే । గోవర్ధనగిరి ధారీరే ॥టా॥

2. మదనమురత ఖుబసురతబసీహై।నటనాగరబ్రజబాసీరే ॥
అతనికుసుమకాంతి బిరాజిత । మోరమగుటగలాం
తులసీరే॥

3. భీమాకేతటి నికట పండరపుర । అజబక్షేత్రి సుఖ
దాయీరే,
తాళవీణ ఔరమృదంగ బజావత । సంతనకీబాదశా
హీరే ॥టా॥

4. భజనపుజన హరికీర్తన నిశిదినిం । గావతహరి లీలారే,
ప్రేమా సుఖకూ, లంపటబైటకర । పుండలీక మత
వాలారే ॥టా॥

5. చోడదియా బైకుంఠ సుఖహరి। భావభకితికె భూకారే,
కహతకబీరా హంసేమిలా । లాగతితుళసీ బుక్కారే॥

నా మా వ ళి

రామకృష్ణహరీ । ముకుంద మురారీ.
రాధాకృష్ణహరీ । గోవింద గోపాళ.

తత్త్వము - ఆదితాళం.

ప॥ ఆడుదీ మళయాళదీ బహు కళలు గలిగిన జాణది॥ఆ॥

1. పరబ్రహ్మనిర్మితమైనది । దేవరంభవలె తా నున్నది,
దాని సందుదెలిసిన సాధులకు।పరముజూపుచునున్నది ॥

2. వాదభేదములేనిది । ఒకచోటనే తా నున్నది,
బ్రహ్మాండమంతయు । వెళ్ళగించుచున్నది ॥ఆ॥

3. మూటిలోపలనున్నది । కనుసూటిబెట్టకమున్నది
మూలమెరిగిన జ్ఞానులొద్ద । ఆనందమాడుచునున్నది॥

4. ఆరుమేడలుపై నది । ఆటలాడుచునున్నది
దట్టమైన వీణయిక । మీటుచు తా నున్నది ॥ఆ॥

5. రూపుచూపు లేనిది । నడివీధిదారిలో యున్నది
మూడుమూల నట్టనడమ । ముక్తికాంతై యున్నది॥ఆ॥

6. శతురివు లార్గురి నింక । నణచిపెట్టిన దాడుది,
చిన్నపెద్దల అద్దులోపల । ముద్దుగుల్కినదాడుది ॥ఆ॥

7. మహా దేవాచార్య మందిరంబున।నాట్యమాడుచునున్నది,
జగతిలో చైతన్యదానుకు । బోధచేయుచునున్నది ॥ఆ॥

ఓమ్ శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శ్రీగీతా నిష్కామ యోగము




గీ తో ప దే శ ము

గ్రంథకర్త:

పండిత, మాకం తిమ్మయ్యా శ్రేష్ఠి.

ప్రథమ ముద్రణ 2000
ద్వితీయ ముద్రణ 2500
తృతీయ ముద్రణ 3000



:: ప్రకాశకులు ::
శ్రీ మద్గీతాలయ
7555 కలాసిగూడ
సికింద్రాబాదు ఆం. ప్ర.



# శ్రీగీతా నిష్కామ యోగము

[ పారాయణ గ్రంథము. ]

## దినచర్య




పండిత:
శ్రీ మాకం తిమ్మయ్యా శ్రేష్ఠి గారిచే
రచియింపఁబడి,


శ్రీ బూరెల సత్యనారాయణమూర్తిగారిచే
పరిష్కరింపఁబడినది.


శ్రీ కొండా శంకరయ్యగారి
ప్రీమియర్ ముద్రాక్షరశాలయందు ముద్రించి,
ప్రకటింపఁబడియె.

1958

# విన్నపము

మహనీయులారా !

శ్రీ భగవద్గీత మోక్షము నొసంగునట్టి సకల వేదాంత శాస్త్రములలోను మహాశ్రేష్ఠ మయినది. మోక్షము సకల వర్ణముల వారికిని, జన్మ స్వాతంత్ర్యమైనది. ఏ మతస్థులైనను, ఏ జాత్యుస్థులైనను, భగవంతునిచే నియమింపబడియుండు స్వకర్మములను నిస్సంగ బుద్ధితో, నాచరించుటవలన, నిరాటంకముగా, సకల దుఃఖములు నశించి, మోక్ష సుఖము గలుగుచున్నదని శ్రీకృష్ణ భగవానుడు గీతయందు స్పష్టముగా చెప్పియున్నాడు.

కావున మోక్షము గలుగుటకు భ్రాంతి జ్ఞానము సమూలముగా నశించవలయును. (అనగా జనన మరణములను సంసార దుఃఖములను నశింప జేసుకొనవలెను.) ప్రతివారును, ప్రతినిత్యము ఉదయము 5 గంటలకు లేచి సులభముగా పారాయణ చేయుటకును, గీతయందు చెప్పబడిన నిష్కామ కర్మాచరణ చేయుటకును, ఎల్లరికి సులభముగా తెలియునట్లు 18 అధ్యాయములు 701 శ్లోకములతోను ప్రతి అధ్యాయము యొక్క అభిప్రాయము తెలియుటకు 18 అధ్యాయములు 18 శ్లోకముల కర్థము; నిదర్శనముగా 18 ఛాయా పటములతో "శ్రీ గీతా నిష్కామ యోగము" 701 శ్లోకములతో పారాయణ గ్రంథముగా ప్రకాశింపజేయ గలిగితిని.

ఇట్టి మహాపవిత్రమైన సద్గ్రంథమును, చదువరులు, పండితులు, శాస్త్రజ్ఞులు, విద్వాంసులు పఠించునప్పు డచ్చటచ్చట పొరపాటున తటస్థించిన స్వల్ప ప్రమాదములను పాటించక అర్థమును వ్యక్తముగా గ్రహించ ప్రార్థన.

ఇట్లు
గీతా ప్రచారకులు
పండిత మాకం తిమ్మయ్య శ్రేష్ఠి.

ఓమ్:

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.



గ్రంథకర్త:

గీతా ప్రచారకులు

పండిత మాకం తిమ్మయ్య శెట్టి.

# శ్రీ గీతా ఆరతి.

1. అరతి ప్రథమకరుం । భగవంతా ।
కృష్ణ చరణనిజ । తేపునిమాతా॥
2. జయజయగీతే । జయ భగవత గీతే ।
హరిహియ కమలవిహారిణీ । సుందర సుపునీతే
3. సృతి స్మృతిసార । శిఖవీ జగిం గీతా ।
సంసారీ కరీందే । పరపూర్థా॥
4. కర్మసుకర్మ ప్రకాశిని । కామాశక్తి హరా ।
తత్వజ్ఞాన వికాసిని । విద్యాబ్రహ్మపరా ॥
5. నిశ్చలభక్తి ప్రదాయిని । నిర్మలమలహారీ ।
తత్వరహస్య ప్రదాయిని । సభవిధి సుఖకారీ ॥
6. రాగద్వేషవిదారిణి । కారిణి మోదసదా ।
భవభయహారిణి । తారిణి పరమానందప్రదా॥
7. అసురభావ వినాశిని । నాశిని తమరజనీ ।
దైవీ సద్గుణదాయిని । హరిరసికాసజనీ ॥
8. సమతత్యాగ శిఖావని । హరిముఖకీబానీ ।
సకలశాస్త్రకీ స్వామిని । శృతియోంకి రాణి॥
9. దయాసుథాబరసావని । మాతు ! కృపాకీ జై ।
హరిపద ప్రేమదానకర।అపనో కరలీ జై॥
10. కృష్ణరూపహి భగవతగీతే । పార్థాసమహరి యదునాథా
జయజయగీతే, జయభగవతగీతే ఆరతిస్వీకరు జగన్మాతా॥

శ్రీ మ ద్గీ తా ల య
మ థ రా సు

గీతాప్రారంభము



శ్రీ భగవానుడు అర్జునునకు గీత తత్త్వోపదేశము జేయుట.

శ్రీ

ఓం శ్రీ కృష్ణాయనమః

# శ్రీ గీతా నిష్కామ యోగము

## గీతా మాహాత్మ్యమ్

—:o:—

ధరోవాచ :—

భగవ న్పరమేశాన భక్తి రవ్యభిచారిణీ
ప్రారబ్ధం భుజ్య మానస్య కథం భవతి హే ప్రభో. 1

శ్రీ విష్ణు రువాచ :—

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతః సదా,
స ముక్తః స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే. 2

మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతిచేత్,
క్వచిత్స్పర్శం న కుర్వంతి నలినీదల మంబువత్. 3

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే,
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై. 4

సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే,
గోపాలా గోపికావాపి నారదోద్ధవపార్షదైః.
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే. 5

యత్ర గీతా విచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్,
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి. 6

గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్,
గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకా న్పాలయామ్యహమ్. 7

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః,
అర్ధమాత్రాక్షరా నిత్యా సాఽనిర్వాచ్యపదాత్మికా. 8

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్,
వేదత్రయీ పరానందా తత్త్వార్థజ్ఞానసంయుతా. 9

యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః,
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరంపదమ్. 10

పాఠేఽసమర్థః సంపూర్ణే తదర్ధం పాఠమాచరేత్,
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః. 11

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్. 12

ఏకాధ్యాయంతు యో నిత్యం పఠతే భక్తిసంయుతః,
రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసేచ్చిరమ్. 13

అధ్యాయం శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః,
స యాతి నరతాం యావన్మనుకాలం వసుంధరే! 14

గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్,
ద్వౌ త్రీనేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠేన్నరః. 15

చంద్రలోకమవాప్నోతి వర్షాణామయుతం ధ్రువమ్,
గీతాపాఠసమాయుక్తో మృతోఽమానుషతాం వ్రజేత్. 16
గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్,
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. 17
గీతార్థ శ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా,
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే. 18
గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః,
జీవన్ముక్తః స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్. 19
గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః,
నిర్ధూత కల్మషా లోకే గీతాయాతాః పరం పదమ్. 20
గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్,
వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః. 21
ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః,
స తత్ఫలమవాప్నోతి దుర్లభాం గతిమాప్నుయాత్. 22

సూత ఉవాచ :—

మాహాత్మ్యమేతద్గీతాయాః మయాప్రోక్తం సనాతనమ్,
గీతాంతే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్. 23

ఇతి శ్రీ వరాహపురాణే శ్రీ గీతామాహాత్మ్యమ్.

---

# అథ అంగన్యాస, కరన్యాసః.

ఓం అస్య శ్రీ భగవద్గీతా శాస్త్ర మహామంత్రస్య । భగవాన్ వేదవ్యాస ఋషిః॥ అనుష్టుప్ ఛందః । శ్రీకృష్ణ పరమాత్మా దేవతా॥

"అశోచ్యా నన్వ శోచ స్త్వం ప్రజ్ఞా వాదాం చ భాషసే ఇతిబీజం । సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశు చ ఇతి కీలకమ్"॥

ఓం నైనం చిన్దంతి శస్త్రాణి నైనం దహతి పావకః—
ఇత్యంగుష్ఠాభ్యాం నమః॥

ఓం న చైనం క్లేదయం త్యాపో న శోష యతి మారుత—
ఇతి తర్జనీభ్యాం నమః॥

ఓం అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్య
ఏవచేతి—మధ్యమాభ్యాంనమః॥

ఓం నిత్యస్సర్వ గతస్థాణు రచలోఽయం సనాతనః—
ఇత్యనామికాభ్యాం నమః॥

ఓం పశ్యమే పార్థరూపాణి శతశోఽథ సహస్రశ—
ఇతి కనిష్ఠికాభ్యాం నమః॥

ఓం నానావిధాని దివ్యాని నానా వర్ణాకృతీ న చ—
కరతల కరపృష్ఠాభ్యాం నమః॥

# అథ హృదయాది న్యాసః

ఓం నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః—
ఇతి హృదయాయ నమః॥

ఓం న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుత—
ఇతి శిరసే స్వాహా॥

ఓం అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య
ఏవచేతి—శిఖాయైవ షట్॥

ఓం నిత్యస్సర్వ గతః స్థాణు రచలోఽయం సనాతనః—
ఇతి కవచాయ హుమ్॥

ఓం పశ్యమే పార్థరూపాణి శతశోఽథ సహస్రశః—
ఇతి నేత్రత్రయాయవౌషట్॥

ఓం నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ—
అస్త్రాయ ఫట్॥

ఓం భూర్భువస్సువరోమితి — దిగ్బంధః॥

శ్రీకృష్ణ ప్రీత్యర్థే గీతాపారాయణే జపే వినియోగః॥

---

ఓమ్.

# గీతా ధ్యానమ్

శ్లో॥ గీతాకల్పతరుంభజే, భగవతా కృష్ణేన సంరోపితం।
వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరో బీజం ప్రబోధాంకురం॥
నానాశాస్త్రరహస్య శాఖ మరతిక్షాంతి ప్రవాళాంకితం।
కృష్ణాంఘ్రిద్వయ భక్తి పుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినాం॥

ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేనస్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్,
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్. 1
నమోఽస్తుతే వ్యాసవిశాలబుద్ధే ఫుల్లారవిందాయత పత్రనేత్ర
మేనత్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః
ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైకపాణయే [ప్రదీపః.
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతమహే నమః. 3
సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్. 4
వసుదేవసుతం దేవం కంసం చాణూరమర్దనమ్,
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్. 5
భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా,

అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ
సోత్తీర్ణాఖలు పాండవైః రణనదీ కైవర్తకే కేశవే. 6
పారాశర్యవచస్సరోజమమలం గీతార్థ గంధోత్కటం
నానాఖ్యానకకేసరం హరికథాసంబోధనా బోధితం,
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే. 7
మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్,
యత్కృపాతమహం వందేపరమానంద మాధవమ్, [స్తవై
యం బ్రహ్మా వరుణేంద్ర రుద్రమరుతః స్తున్వంతి దివ్యైః
ర్వేదై స్సాంగపదక్రమోపనిషదై ర్గాయంతి యం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినో
యస్యాంతం న విదుః సురాసురగణా దేవాయ తస్మైనమః.

హరిః ఓమ్.

శ్రీ కృష్ణార్పణ మస్తు.



ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః.

# శ్రీ గీతా నిష్కామ యోగము

## ప్రథమోఽధ్యాయః.

## అర్జున విషాదయోగః.



ధృతరాష్ట్రునకు సంజయుడు గీతామాహాత్మ్యమును చెప్పుట.

ధృతరాష్ట్ర ఉవాచ (మూలజ్ఞానము) :—

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. 1

భావార్థము :—

సంజయా ! (ఓ నిర్మలబుద్ధీ !) ఈ శరీరము ధర్మార్థ కామ మోక్షములకు ఉత్పత్తిస్థానము; జీవునకు వాసస్థానము; నవద్వార ములుగల పురము. ఈ పురమునందు అహంకారాదులైన నావారు దుర్యోధనాదులున్ను - సమస్తము గోల్పోయి స్వారాజ్య (మోక్ష) ప్రాప్తికొరకై అహంకారాదులైన, మావారితో యుద్ధము జేయుటకు సన్నద్ధులైన వివేకాదులు పాండు పుత్రులున్ను ఏమిచేయుచుం డిరి? అని ధృతరాష్ట్రుడు (మూలజ్ఞానము) అడుగగా, సంజ యుడు (నిర్మల బుద్ధి) ఇట్లు చెప్పుచున్నది.

ఆత్మ స్వరూపులారా !

గీతా నిశ్చయ భావము గమనించుడు.

యీ శరీరమను రాజ్యమే హస్తినాపురము, ఇది హస్తులతో నిర్మింపబడినది. ధృతరాష్ట్ర మహారాజనగా గ్రుడ్డివాడు. (రజ స్తమోగుణములకు సంబంధించిన అజ్ఞాని) పాండు మహారాజ నగా శుద్ధ సాత్త్విక గుణమునకు సంబంధించిన, జ్ఞానము. వీరి ద్దరు పరబ్రహ్మమను తండ్రి కుమారులు. సంజయు డనగా, సర్వేంద్రియములను జయించిన నిశ్చలబుద్ధి. అర్జునుడనగా వివే కముతో గూడిన జీవుడు. శ్రీకృష్ణు డనగా నిశ్చలమైన జ్ఞాన స్వరూ పుడు. లేక పరబ్రహ్మ స్వరూపుడు.

ఈ నవద్వారములతో గూడిన దేహమను హస్తినాపురమందు ఒక ప్రక్కన ధర్మక్షేత్రము, ఒకప్రక్కన కురుక్షేత్రమును గలవు. ధర్మక్షేత్రమ్మునకు అధికారి, పాండు మహారాజు, (మమప్రాణాహి పంచ పాండవాః). అనగా శుద్ధ సాత్త్విక గుణముతోగూడిన జా

మునకు పంచప్రాణులే పంచపాండవులు. ధర్మ భీమార్జునులు. వీరివలన శాంతము, దయ, ప్రేమ, కరుణ మొదలగు సద్గుణము లచే, యజ్ఞములు, యాగములు, దానధర్మములు, పరోపకార ములు ఈశ్వరభక్తి మొదలగు ధర్మములు నిష్కామ బుద్ధితో జరుగుచుండుటవలన అట్టి హృదయ భూమియే ధర్మక్షేత్రము. ఇట్లు ఎవరు సద్గుణములతో, నిష్కామబుద్ధితో, సత్కార్యములు జేయుచున్నారో అట్టి పవిత్రమైన హృదయముగలవారు ఇహము నందు శరీర సుఖము, పరమునందు ఆత్మ సుఖము ననుభవిం తురు. మరియును,

ఈ దేహమే పాపకర్మములకు పుట్టినిల్లుగా నున్నది. ఎట్ల నగా ఈ దేహమునందొక కురుక్షేత్రమున్నది. దాని కధికారి, ధృత రాష్ట్ర మహారాజు. గ్రుడ్డివాడు, అజ్ఞాని. వీరికి పుత్రులు రజస్తమో గుణములకు సంబంధించిన అహంకారాదులగు దుర్యోధనాదులు. సమస్త విషయేంద్రియములతో కూడిన 101 పుత్రులు. వీరివలన మోక్షమునకు విరోధమైన చెడుకార్యములు అనగా కొట్టుట, తిట్టుట, ఒకరిని దూషించుట, హింసించుట, జీవహింస జేయుట పరద్రవ్య మపహరించుట, స్త్రీలను భంగపరుచుట, దొంగిలించుట త్రాగుట, తినుట, "నేను" అని అహంకరించుట మొదలగు చెడు కార్యములే నడుచుచుండును. కావున దుఃఖముల పాల్సేయు కురుక్షేత్రమని చెప్పబడును. కావున,

లోకమునందుగల మానవులకు, చెడుగుణములవలన దుః ఖములు, మంచిగుణములవలన సుఖములు గలుగునని, దయా నిధి శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించిన గీతను నిశ్చల జ్ఞానము

నొసంగునట్టి ఉత్తమ గ్రంథమని సర్వులు ప్రేమించుచున్నారు. మరియును,

శ్రీ స్వస్వరూప సంధానమునందు 22 వ పేజీ మొదలు 37 పేజీ వరకు "గీతాతత్త్వోపదేశము - ముఖ్యాభిప్రాయము" "గీత అనుష్ఠానము" అను రెండు ఉపన్యాసముల యందుగల అంతర భావమును గమనించుడు.

సంజయ ఉవాచ :—

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥ 2
పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూం,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ 3
అత్ర శూరా మహేష్వాసాః భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ 4
ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥ 5
యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥ 6
అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ 7
భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ॥ 8

